

## సాధకుని స్వీయ పరిచయం

**జననం** : విజయనగరములో తేది 15-3-1946

**జననీ జనకులు** : కీ॥శే॥ వెంకటరత్నం,
కీ॥శే॥ భాస్కరరావు గారులు

**ఉద్యోగము** : విశాఖ పోర్టులో తేది 15-3-1966 న అక్కౌంట్సు విభాగములో చేరి తేది 30-3-2001 న స్వచ్ఛంద పదవీ విరమణ.

**ఆధ్యాత్మికము** : 1978 లో 'శ్రీ ఆంజనేయస్వామి' మహిమ చూపి ఆధ్యాత్మిక మార్గములోనికి మార్చి ఇప్పటికీ కూడ సంగీతముతో పాటు ఏమీ తెలియని యీ సాధకునికి యెన్నో యిచ్చారు. అందులో కొన్ని వివరాలు . . .

**హనుమాన్ చాలీసా గానము** : 1978 నుండి (2 లక్షలకు పైగా) సామూహిక అభిషేక సహిత హనుమాన్‌చాలీసా గానములు జరుగుతున్నవి.

**సంకీర్తనలు** : 1978 నుండి అందరి దేముళ్ళ నామసంకీర్తనలు అందరిచేత వంతపాడిస్తూ 5000 లకు పైగా జరిగినవి.

**సామూహిక శ్రీరామ కోటి లిఖిత యజ్ఞము** : 1986 లో ప్రారంభింపబడి యిప్పటికి 19 కోట్లు శ్రీరామ నామములు సేకరించబడి అందు 13 కోట్లు స్థూపమునందు, శ్రీ సీతారాముల విగ్రహ ప్రతిష్ఠాపనలయందు నిక్షిప్తము చేయబడినవి. 6 కోట్లు శ్రీరామ నామములు ఆసక్తి గల భక్తులకై సిద్ధముగా ఉన్నవి.

**సుందరకాండ కథాగానములు** : 1995లో ప్రారంభింపబడి నేటికి 650 కు పైగా జరిగినవి. భక్తుల కోర్కెలపై గృహములలో, ఆలయములలో 1 దినము నుండి 9 దినముల వరకు జరుగుతున్నవి.

**పుస్తకములు** : (1) 1987లో నిత్యపూజా శ్లోకములతో హనుమాన్‌చాలీసా పుస్తకములు ముద్రించబడి భక్తుల విశేష ఆదరణతో నేటికి 26 ముద్రణలు జరిగి లక్షా పదహారువేలు పుస్తకములు భక్తులకు చేరినవి.

(2) 1989 లో భగవత్ సంబంధమైన విషయాలతో 200 పేజీలతో 'ఆధ్యాత్మిక దర్పణము' పుస్తకము ముద్రించబడినది.

# శ్రీ హనుమద్వ్రత కల్పము









సంకలనం : కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్

జననం
13-04-1909
వైకుంఠధామం
19-03-1996





జననం
డిశంబరు 1919
వైకుంఠధామం
24-01-2001



కీ॥శే॥ **శ్రీమతి వెంకటరత్నం** గారు

కీ॥శే॥ **కొమ్మూరు భాస్కరరావు** గారు, B.A.

(Retd. Forest Range Officer)

సంసారమనెడి విషవృక్షములో రెండే రెండు అమృత ఫలములు కలవు. అవి సజ్జన సాంగత్యము మరియు కావ్యామృత రసపానము. మధురమైన ఆ అమృతఫలములను మీరు ఆస్వాదించి వాటిని మాకు రుచి చూపించి వారసత్వపు ఆస్తులుగ అందజేసి మీ ఘనతను చాటుకున్నారు. అనితర సాధ్యమైన ఆమార్గములో మీ పుత్రుడు పడుతూ లేస్తూ పయనము సాగిస్తూ ఎంతో మందికి ఆ అమృతఫలముల రుచిని చూపిస్తున్నాడు.

శ్రీ ఆంజనేయస్వామిని గురువుగా భావించి యే శాస్త్రములోను కనీస పరిజ్ఞానము లేకపోయినా గత 32 సంవత్సరములుగా చేస్తున్న ఆధ్యాత్మిక సాధన ఫలితముగా ఆశించని ఊహించని ఫలితములను పొందుతున్న మీ కుమారునికి చివరి ఊపిరి వరకు సాధన జరిగేటట్టు దీవించమని కోరుతూ ....

అర్థ సహస్ర సుందరకాండ కథాగాన శిరోమణి
ఆధ్యాత్మిక తత్త్వజ్ఞాన శిరోమణి
**కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్**

# శ్రీ హనుమద్వ్రత కల్పము

శ్లో॥ సీతాశోకస్య నాశాయ - శ్రీరామే శోకనాశనం ।
సాధకానాం సుఖం ధన్యం - వాయుసూనం నమామ్యహమ్ ॥
(వానరగీతలో - పక్షిరాజు సంపాతి)

భావము : సీతాదేవి యొక్క దుఃఖము పోగొట్టువానిని, శ్రీరామచంద్రుని దుఃఖము పోగొట్టువానిని, సాధకులగు వారికి సుఖరూపమై యుండునట్టి ధన్యుడగు హనుమంతుని గూర్చి నేను నమస్కరించుచున్నాను.

# సంకలనం

ఆకాశవాణి, విశాఖపట్నము వారిచే
'భక్తి సంగీత కళాకారుడు'గా ఎంపిక చేయబడినవారు,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిచే 'యక్షగాన కళాకారుడు'గా
గుర్తింపుపొందినవారు.

'నాదోపాసకులు', 'శ్రీ సీతారాముల ఆరాధకులు',
'అసాధ్య సాధక సాధనపరులు', 'శ్రీహనుమాన్ చాలీసా పారాయణ ప్రవీణ',
'శ్రీమారుతీ పదభక్త', 'శ్రీమారుతీ యక్షగాన ప్రవీణ',
'గానసరస్వతిపుత్ర', 'గానరత్న',
గాన గంధర్వ, 'సుందరకాండ కథాగాన శిరోమణి'.

'అర్థ సహస్ర సుందరకాండ కథాగాన శిరోమణి'
'ఆధ్యాత్మిక తత్త్వజ్ఞాన శిరోమణి'

**కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్**

విజయదశమి
17-10-2010

5000 పుస్తకములు

పుస్తకములు దొరుకు స్థలము :

**శ్రీమతి కనకలత**
W/o శ్రీ కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్
శ్రీమారుతీ నిలయము
F/5 సాయి విఘ్నేశ్వర అపార్టుమెంట్స్
డోర్ నెం. 49-27-42
మధురానగర్
విశాఖపట్నము - 530 016
ఫోన్ : 0891-2559624
సెల్ : 98484 62805
E-mail : kommuru.umaprasad@gmail.com
Web : www.sundaraakaanda.blogspot.com

ఆర్యభాస్కర్ ప్రచురణలు
వెల : రూ|| 10/-

ముద్రణాలయము
**Sri Ramakrishna Printers Pvt. Ltd**
49-24-5, Madhuranagar,
Visakhapatnam - 16
Ph : 0891-2798072

# కృతజ్ఞతాంజలులు

బంగారు పళ్ళెముకైనా గోడదాపు ఉండాలని పెద్దలు అంటుంటారు. గురుదేవులు శ్రీ ఆంజనేయస్వామి ప్రేరణతో సంకల్పించిన యీ చిన్ని పుస్తకము రూపు దాల్చుటకు కారణభూతులయిన యీ క్రింది పెద్దలకు 'కృతజ్ఞత' అనే పదము ఉపయోగించుటకు చాల తక్కువే అవుతుంది.

**1. పూజ్యులు శ్రీ పుల్లదాసుగారు :** 'ఆంజనేయ సహస్రము' పుస్తకము వీరిచే రచించబడి చెన్నపట్టణములో 1905వ సంవత్సరములో ముద్రించబడినది.

**2. బ్రహ్మశ్రీ శిష్లా చంద్రమౌళి శాస్త్రిగారు :** 'హనుమద్వ్రత జయంతీ ప్రదక్షిణ కల్పము' గ్రంథము మంత్రశాస్త్ర ప్రవీణులైన వీరిచే కూర్చబడి 1949 లో విజయవాడ యందు ముద్రించబడినది.

**3. శ్రీమాన్ ఇరగవరపు గోపాలాచార్యులు గారు :** 'సజ్జన ధార్మిక వేదిక' స్థాపించి గత 27 సంవత్సరములుగా వేలాది మందిని చైతన్యపఱచి ఆధ్యాత్మిక జీవనములో నిష్ణాతులుగా తీర్చిదిద్దుతూ, నిరంతరముగా భగవత్సేవ చేస్తున్న అరుదైన ఆధ్యాత్మిక భావ ప్రపూర్ణులు, నిరాడంబరులు, సహృదయులు అయిన వీరు యీ చిన్ని పుస్తకమును తీర్చిదిద్దినారు.

**5. శ్రీరామకృష్ణా ప్రింటింగ్ ప్రెస్ అధినేత శ్రీరామకృష్ణ గారు :** గత 10 సంవత్సరములుగా ముద్రణలో ప్రతిఫలాపేక్షలేకుండా సహకరించుతూ యీ చిన్ని పుస్తకమును కూడా నిండు హృదయముతో ముద్రించి యిస్తున్నారు.

పైన పేర్కొన్న మరియు వారి కుటుంబసభ్యులను గురుదేవులు శ్రీ ఆంజనేయస్వామి మరియు తల్లీ తండ్రీ సర్వస్వం అయిన శ్రీ సీతారామచంద్రులు సర్వదా కాపాడవలసిందిగా ప్రార్థిస్తూ ....

**కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్**

# ఆప్తవాక్యం

శ్రీమాన్ కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్‌గారు ఆయన సంకలనము చేసిన **'శ్రీహనుమద్వ్రత కల్పము'** పుస్తకాన్ని తీసుకువచ్చి యీ చిన్ని పుస్తకమును ముద్రింపజేసి పదిమంది చేత ఆచరింపజేయాలనే సంకల్పము గురుదేవులు శ్రీఆంజనేయస్వామి దయవలన కలిగింది మీరు చూసి యిందులో మార్పులు, చేర్పులు సూచించవలసిందిగా కోరారు.

మా **'సజ్జనధార్మిక వేదిక'** యింతవఱకు ప్రచురించిన 21 పుస్తకములు ప్రతీ సామాన్యుడిని దృష్టిలో పెట్టుకొని వితరణ చేయబడినవే! ఏదో ఒక మార్గము ద్వారా ఎదుట వారిని చైతన్యపఱచడమే మా లక్ష్యం. గమ్యం చేరాలంటే వారి వారి స్థాయిని బట్టి వేరు వేరు మార్గములు యెంచుకుంటారు. ఆ మార్గములు మనకు ముందుగా అవగాహన అయితే మన ప్రయాణము సుఖవంతము అవుతుంది కదా !

వ్యాస భగవానుడు కలియుగములో మానవుల పరిస్థితిని తన భవిష్యత్ దర్శనమనే తపఃశక్తితో గ్రహించి, స్కంధ పురాణములో అనేకానేక వ్రత విధానములను సూతమహర్షి శౌనకాదిమునులకు చెప్పినట్లుగా మనకు అందించారు. అవి చూసి అయినా కలియుగ మానవులకు అవి సాధన చేసే బుద్ధిగాని, సంకల్పముగాని కలిగితే ఉద్ధరింపబడతారు అని ఆయన భావించారు.

అయితే వాటిని ఆచరింపజేసే మహానుభావులు వారి వారి ప్రాంతములందు గల ఆచారములకు సాంప్రదాయములకు అనుగుణముగా వాటిని కొద్ది మార్పులతో ప్రచారములు చేస్తున్నారు. మూల పదార్థము ఒకటే అయినా ప్రాంతీయ పద్ధతులతో ఆచరించబడుచున్నవి. అదే రీతిలో ఆమూల పదార్థమును పట్టుకొని శ్రీ హనుమంతుడినే గురువుగా నమ్మి ఒక రీతిలో ఉద్యోగరీత్యా జీవించిన



ఉమాప్రసాద్ గారు అనేకమంది పెద్దల మంగళాశాసనములతో మరో జన్మ (ద్విజన్మ) ను పొందినట్లుగా శ్రీరామ పాదసేవా దురంధరుని నమ్మి సాధన చేస్తూ విజయాలవైపు దూసుకువెళుతున్నారు. ఒక ప్రక్క ఆంజనేయస్వామి ఋణము తీర్చుకొనే విధం కనపడుచున్నది. మరో ప్రక్క తనను నమ్మిన వారిని తనలానే శ్రీ ఆంజనేయస్వామి పాద సేవకులను చేయాలనే సంకల్పము యీ పుస్తక సంకలనములో కనపడుతున్నది.

ఇంతకన్నా సులువుగా, సవిస్తరముగా అందించడము మరి యెవరికీ సాధ్యం కాదేమో. ఎవరికి వారు ఆచరిస్తే ఆయన శ్రమకు, సాధనకు ప్రతిఫలం లభిస్తుందని నా భావన.

ఈ సాధకుని సంకల్పము నెరవేరాలని మా ఆరాధ్య దైవాలు రాధా మాధవులకు ప్రణమిల్లుతూ మా గురువుగారైన శ్రీమాన్ ఇరగవరపు లక్ష్మణాచార్యస్వామి శ్రీ హస్తముతో ఉమాప్రసాద్‌గారికి మంగళాశాసనములు అందిస్తూ వారి సాధనకు, అభివృద్ధికీ ఆనందించే వారిలో ఒకరిగా ....



**మీ గోపాలాచార్యులు**
సజ్జనధార్మిక వేదిక
మధ్యవీధి, ఇం.నెం. 5-62
సింహాచలము, విశాఖపట్నం - 530 028
సెల్ : 92477 08398
90008 15832

విజయదశమి
తేది : 17-10-2010



# పూజా సామాగ్రి



పసుపు, కుంకుమ, సింధూరము, గంధము, కర్పూరము, అగరుబత్తీలు, సాంబ్రాణి లేక గుగ్గిలము, అగ్గిపెట్టె, బియ్యము, అక్షతలు, ముగ్గుపిండి, 2 రంగుల పొడులు. కొబ్బరికాయలు, అరటిపళ్లు 13 చొప్పున 5 రకముల పళ్ళు, తులసి దళములు, తమలపాకులు, వక్కలు, 25నాణెములు. తెల్ల తువ్వాలు, చేతిగుడ్డ, కలశముపైన అలంకరించుటకు పసుపురంగు (పట్టు), వస్త్రము, 7 పోగులు కల పసుపురంగు పట్టుతోరము, పత్తిదారములు, ఆంజనేయస్వామి లోహ ప్రతిమ. మంటపమునకు అడుగు ఎత్తు గల ఆసనము లేక బల్ల, ఆచమన (పంచ) పాత్రలు 2, ఉద్ధరిణెలు 2, కలశపూజకు ప్రధాన కలశము, పంపానది పూజకు చిన్న కలశము, హారతి పళ్ళెము, జే గంట, కొబ్బరికాయ కొట్టుటకు రాయి, పాత గుడ్డలు, కొబ్బరి నీరు పట్టుటకు పాత్ర. 2 దీపములు వెలిగించుటకు దీపారాధన సామాగ్రి.

ముదరపాకము తీపిబూందితో లాడులు 13, నిమ్మకాయలు 13, పానకము యింకా శక్త్యానుసారము. మామిడి ఆకుల తోరణములు, కలశపూజకు పంచపల్లవులైన - మామిడి, మఱ్ఱి, మేడి, రావి, జువ్వి వృక్షముల లేత ఆకులు

**కొన్ని జాగ్రత్తలు :**

పూజ చేయుచుండగా మన పాదములకు పూజ సామాగ్రి గాని మన చేతులు గాని తగలకుండా కాళ్ళ క్రింద నుండి ఒడిలోనికి వస్త్రము కప్పుకోవలెను

పూజ వస్తువులు, నివేదన చేసే పదార్ధములు అన్నియు నేలపై పెట్టరాదు నేలపై పెట్టినవి భగవత్ కైంకర్యమునకు పనికి రావు.



# వ్రతమునకు ముందు చేయవలసిన ఏర్పాటులు

శ్రీ హనుమద్వ్రతము సాయం సంధ్య సమయములో ఆచరించవలెను. యీ వ్రతము చేసుకొనుటకు ముందు రోజు నుండి పవిత్రమైన మనస్సుతో, భక్తి శ్రద్ధలతో ఏర్పాటులు చేయుట చేత ఆధ్యాత్మిక శక్తి తరంగములు వ్రతము చేయు ప్రదేశము నందు ముందుగనే ప్రవేశించును.

వ్రతము నిర్వహించు ముందు రోజు రాత్రి బ్రహ్మచర్యమును పాటించి, ఉషఃకాలమందు మేలుకొని మాతాపితృల స్మరణ చేయుచు అభ్యంగస్నానాది నిత్యకర్మలను చేసుకొని, శుచి అయి పూజా మందిరములో కూర్చొని మనస్సులో శ్రీ ఆంజనేయస్వామి దివ్యనామము జపము చేసి, నిత్యఆరాధనను చేసి, **'ఓ ఆంజనేయస్వామీ ! శ్రీసీతారామచంద్రుల అనుజ్ఞతో శ్రీ హనుమద్వ్రతమును నీ అనుగ్రహము కోసము చేయుచున్నాము'** అని ప్రార్థించి నమస్కరించవలెను. మామిడి ఆకుల తోరణములతో పుష్పమాలలతో గృహమును, పూజామందిరమును అలంకరించి, సాంబ్రాణి లేక గుగ్గిలముతో ధూపము వేయవలెను.

తూర్పు ముఖముగా మనము కూర్చొని పూజ చేయు స్థలమును శుద్ధి చేసి పసుపు, కుంకుమ, వరిపిండితో సహా మొత్తం 5 రంగులతో 3 ముగ్గులు వేయవలెను. ఉత్తరముగా **'స్వస్తిక్'** ముగ్గు, ప్రక్కనే ప్రధానమైన **'13 దళముల ముగ్గు'**, ప్రక్కనే దక్షిణముగా **'శంఖము'** ముగ్గువేసి నమస్కరించవలెను.

పూజ చేసేటప్పుడు అర్చామూర్తి **(కలశముపై ఉన్న తోరము)** మన హృదయ స్థానమునకు - నేత్రముల స్థానమునకు మధ్యన ఉండవలెను. కావున **'ఒక అడుగు ఎత్తు'** బల్లగాని దేముని పీటగాని

తీసుకొని శుద్ధి చేసి మొత్తం పసుపు వ్రాసి కుంకుమ, బియ్యపు పిండి, సింధూరములతో బొట్లు పెట్టి ఆ పీఠమును 13 దళముల పద్మము ముగ్గుపై ఉంచవలెను.

అంచులు గల తెల్ల తువ్వాలును పీఠముపై సర్దవలెను. ఆ వస్త్రముపై చూపుడు వ్రేలు వాడకుండా సింధూరముతో **'ఓం నమోభగవతే వాయునందనాయ'** అను త్రయోదశ అక్షరి మంత్రమును భక్తితో వ్రాసి 13 పర్యాయములు స్పష్టముగా పలుకుతూ అక్షతలతో పూజించవలెను. 1 కేజి బియ్యమును మంత్రము వ్రాసిన వస్త్రముపై సమముగా సర్దవలెను.

ప్రధాన కలశమునకు పైన పసుపు వ్రాసి గంధము, వరిపిండి, సింధూరములతో చుట్టూబొట్లు పెట్టవలెను. పంపానది జలమునకు పూజ చేసే కలశమునకు చుట్టూ పసుపు వ్రాసి గంధము, కుంకుమ, వరిపిండితో బొట్లు పెట్టవలెను.

7 పోగులు కల పసుపురంగు పట్టుదారమును, ఆంజనేయస్వామి ప్రతిమను పంచామృతముతో అభిషేకించి, తులసి దళములు గల జలముతో శుద్ధిచేసి పసుపు పూయవలెను. గురువును స్మరించుకొని, విఘ్నేశ్వరుని తలచుకొని పట్టుదారమును నేలమీద పడకుండా పట్టుకొని ఆంజనేయస్వామిని తలచుకొని త్రయోదశ అక్షరమంత్రము **'ఓం నమో భగవతే వాయునందనాయ'** పలికి ఒక ముడి (గ్రంధి)ని వేయవలెను. ఈ విధముగా 13 పర్యాయములు మంత్రమును పలుకుతూ 13 ముడులు వేయవలెను.

ఈ విధముగా వ్రతము మొదలు పెట్టుటకు ముందు అన్నీ తయారు చేసుకొనవలెను.

వ్రతము ఆచరించువారు ఆ దినమున ఉల్లి, వెల్లుల్లి లేకుండా హవిస్సు (బియ్యము నేతిలో వేయించి అన్నము వండుట)ను గాని, పొంగలిగాని, ఫలహారము గాని తీసుకొనవలెను.



# శ్రీ హనుమద్వ్రతము ఆరంభము

## ఓం కారము

ॐ

(త్రిమూర్త్యాత్మకమగు భగవంతుని ధ్యానించుచూ దైవకార్యము నందు ముందుగా పలుకవలసిన 'ఓం' కారముతో కూడిన యీ క్రింది మంత్రమును త్రికరణ శుద్ధిగా పలుకవలెను.)

**హరిః ఓం ! హరిః ఓం ! హరిః ఓం !**

* * *



## తల్లిదండ్రుల స్మరణము



(జన్మనిచ్చిన మరియు ప్రత్యక్ష దైవములైన తల్లిదండ్రుల రూపములను మనస్సులో ధ్యానము చేయుచు యీ క్రింది విధముగా పలుకవలెను.)

**మాతృదేవో భవ ! పితృదేవో భవ !**

* * *

## గురు వందనము



(గురువునకు నమస్కరిస్తూ యీ క్రింది విధముగా పలుకవలెను.)

**ఆచార్యదేవో భవ !**

* * *

## బాహ్యముగా, అంతరముగా శుద్ధి

(మనలో శారీరకముగా, మానసికముగా ఉన్న అపవిత్రతలను పోగొట్టే మహత్తు కలిగిన పుండరీకాక్షుని నామమును మూడు పర్యాయములు పలుకుచూ జలమును శిరస్సుపై మూడు సార్లు జల్లుకొని పవిత్రులము అవుచున్నట్లు సంకల్పించుకోవలెను.)

**పుండరీకాక్ష ! పుండరీకాక్ష ! పుండరీకాక్షాయ నమః !**

* * *

## ఘంటారావము



(ఘంట వాయిస్తూ యీ క్రింది విధముగా పలుకుచూ దేవతలు వచ్చునట్లును, దుష్టశక్తులు పోవునట్లును సంకల్పించవలెను.)

**ఓ దేవతలారా ! ఇప్పుడు నిర్వహించబడుచున్న దైవకార్యమునకు మీరు వచ్చి సహకరించుటకు లాంఛనముగా ఆహ్వానముగా ఘంట వాయించుచున్నాను. తరలి రండి !**

**దైవకార్యమునకు ఆటంకము కలిగించే శక్తులు ఏవయినా ఉన్నచో వెంటనే వెళ్ళిపోవును.**

* * *



## తైల దీపములు

(ఒక్కొక్క దీపమునకు 2 వత్తులు కలిపి ఒక వత్తిగా చేసి రెండు దీపములు వెలిగించి ఒక దీపము తూర్పుముఖముగను, రెండవ దీపము



ఉత్తర ముఖముగను (మంటపమునకు రెండు ప్రక్కలా) ఉంచవలెను. అనంతరము దీపకాంతులు నిండిన ఆ ప్రదేశములో దేవతల దివ్యతేజస్సు వచ్చి చేరినట్లు సంకల్పించుచూ ప్రశాంతమైన మనస్సుతో నమస్కరించవలెను.)

## ఉదక పూజ

(ఆచమనము చేయబోయే ముందు ఆ జలమును ప్రార్థించినచో మంచి ఫలితములు కలుగును. కావున ఆచమన (పంచ) పాత్రలో జలము వేసి తులసి దళము, పుష్పము పెట్టి కుడిచేతి ఉంగరము వ్రేలు జలమునందు ఉంచుతూ ...)

**ఓ జలములారా! మీరు ఆనందమునకు, అనంత శక్తికి పుట్టినిల్లు కనుక మాకు సంతోషమును, బలమును కలిగించవలెనని ప్రార్థించుచున్నాను.**

## ఆచమనముతో గోవిందనామములు

(మొదటి మూడు నామములతో ఆచమనము చేస్తూ మగవారు 'స్వాహా!' అనియు ఆడవారు 'నమః' అనియు పలుకవలెను.)

| | |
|---|---|
| 1. కేశవాయ స్వాహా | 2. నారాయణాయ స్వాహా |
| 3. మాధవాయ స్వాహా | 4. గోవిందాయ నమః |
| 5. విష్ణవే నమః | 6. మధుసూదనాయ నమః |
| 7. త్రివిక్రమాయ నమః | 8. వామనాయ నమః |
| 9. శ్రీధరాయ నమః | 10. హృషీకేశాయ నమః |
| 11. పద్మనాభాయ నమః | 12. దామోదరాయ నమః |
| 13. సంకర్షణాయ నమః | 14. వాసుదేవాయ నమః |
| 15. ప్రద్యుమ్నాయ నమః | 16. అనిరుద్ధాయ నమః |

17. పురుషోత్తమాయ నమః 18. అధోక్షజాయ నమః
19. నారసింహాయ నమః 20. అచ్యుతాయ నమః
21. జనార్ధనాయ నమః 22. ఉపేంద్రాయ నమః
23. హరయే నమః 24. శ్రీకృష్ణాయ నమః

* * *

## ప్రాణాయామము

(ప్రాణాయామ మంత్రము ఉచ్చరించునపుడు వేళ్ల చివరలతో ముక్కు చివరలను మూయట పాపనాశనమని చెప్పబడినది కనుక కుడిచేతి బొటనవేలు, మధ్యవేలు, ఉంగరపు వేళ్ళ చివరలతో ముక్కు చివరలు మూస్తూ 'ఓం భూః మొదలుకొని ... ఓమాపోజ్యోతి రసోమృతం బ్రహ్మ' వరకు పలికి కుడి చెవిని తాకి 'భూర్భువ స్సువరోం' అని పలికి నెమ్మదిగా గాలి వదలవలెను.)

ఓం భూః । ఓం భువః । ఓగ్ం సువః । ఓం మహః । ఓం జనః । ఓం తపః । ఓగ్ం సత్యం । ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః ప్రచోదయాత్ । ఓమాపో జ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోం ॥

* * *

## సర్వదేవతా ప్రార్థన

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః ।
యేషాం ఇందీవర శ్యామో హృదయస్థో జనార్దనః ॥

శ్లో॥ ఆపదామ పహర్తారం దాతారం సర్వసంపదాం ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥

ఓం శ్రీలక్ష్మీ నారాయణాభ్యాం నమః



ఓం శ్రీ ఉమా మహేశ్వరాభ్యాం నమః
ఓం శ్రీవాణీ హిరణ్యగర్భాభ్యాం నమః
ఓం శ్రీ శచీ పురందరాభ్యాం నమః
ఓం శ్రీ అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః
ఓం శ్రీ సీతా రామాభ్యాం నమః
సర్వేభ్యో, మహాజనేభ్యో, భాగవతేభ్యో నమః
మాతా పితృ చరణ కమలేభ్యో నమః
అయం ముహూర్తః శుభ ముహూర్తో అస్తు !

* * *

## వ్రత సంకల్పము

(నాచే ఆర్జించబడిన పాపములు నశించుట కొఱకు శ్రీ పరమేశ్వరుని అనుజ్ఞ చేత. శ్రీరామ పాద సేవా దురంధరుడైన శ్రీ ఆంజనేయస్వామి అనుగ్రహముతో అనేక శుభములు పొందుటకు శ్రీహనుమద్వ్రతమును చేయుచున్నాను అను భావముతో యీ క్రింది సంకల్పమును పలుకవలెను.)

ఏవంగుణ విశేషణ విశిష్టాయాం ... శుభతిథౌ ... ధర్మపత్నీ సమేతస్య .. సకుటుంబస్య ... సకల లోక కళ్యాణార్ధం ... మమోపాత్త దురిత క్షయద్వారా ... శ్రీ పరమేశ్వర ప్రీత్యర్ధం ... శ్రీ హనుమద్వ్రత కల్పోక్త సంపూర్ణ ఫలా వ్యాప్యర్థం .. క్షేమ, స్థైర్య, విజయ, అభయ, ఆయుః, ఆరోగ్య, ఐశ్వర్య, అభివృద్ధ్యర్థం .. ధర్మ, అర్ధ, కామ, మోక్ష, చతుర్విధ ఫల పురుషార్ధ సిద్ధ్యర్థం ... సమస్త సన్మంగళ ఫలా వ్యాప్యర్థం ... ఇష్ట కామ్యార్ధ సిద్ధ్యర్థం ... సమస్త శత్రు పలాయనార్ధం .. సమస్త పాపక్షయార్ధం .... మోక్షార్ధం శ్రీ సీతాలక్ష్మణ భరత శతృఘ్న హనుమత్ సమేత

శ్రీరామచంద్ర ప్రభు అనుజ్ఞయా శ్రీ సువర్చలా సహిత హనుమత్ వ్రతం కరిష్యే ! శ్రీ హనుమద్వ్రతాంగ పంపానదీ జల పూజాం కరిష్యే ! అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే ! తదంగ కలశారాధనం కరిష్యే !

(అక్షతలను, ఉదకమును చేతిలో తీసికొని పళ్ళెములో వదలవలెను).

* * *

## సకల లోక పూజ



(5 రంగులతో 13 దళముల ముగ్గు మరియు రెండు ప్రక్కల ఓంకారము, స్వస్తిక్ ముగ్గులు వేసిన ప్రదేశమునకు అక్షతలతో పూజ చేస్తూ ...)

అతలాయ నమః - వితలాయ నమః
సుతలాయ నమః, - రసాతలాయ నమః
తలాతలాయ నమః - మహాతలాయ నమః
పాతాలాయ నమః - సర్వతోభద్రాయ నమః
తత్ర కమలే కమఠాయ నమః -
సహస్ర ఫణి ప్రకాశమాన శేషాయ నమః - దిగ్గజేభ్యో నమః
భూలోకాయ నమః - భువర్లోకాయ నమః
సువర్లోకాయ నమః - జనలోకాయ నమః



తపోలోకాయ నమః - మహర్లోకాయ నమః
సత్యలోకాయ నమః - దిక్పాలికేభ్యో నమః
మధ్యే మేరవే నమః - తత్ దక్షిణ భాగే ద్రోణశైలాయ నమః
కల్పవృక్షాయ నమః - తన్మూలే సువర్ణ వేదికాయై నమః
వేదికాయాం నవరత్న ఖచిత సింహాసనాయ నమః

* * *

## ఆసన పూజ

(ఆ ముగ్గులపై **'స్వామి'** మూల మంత్రమును వ్రాసిన వస్త్రముపై బియ్యమును సర్దిన పీఠమును అక్షతలతో పూజిస్తూ ...)

అనంతాసనాయ నమః - కమలాసనాయ నమః
విమలాసనాయ నమః - యోగాసనాయ నమః
కూర్మాసనాయ నమః - మధ్యే పరమ సుఖాయ నమః

* * *

## కలశ పూజ



(శ్రీ ఆంజనేయ స్వామిని కలశము మీద ఆవాహన చేసి పూజించబోతున్నాము. అందుచేత ప్రధాన కలశమును హృదయ పూర్వకముగా బియ్యము సర్దిన తెల్లని వస్త్రముపై మధ్యలో పెట్టి, సగము

వఱకు జలము పోసి కొద్దిగా గంధము, అక్షతలను, పుష్పమును అందులో ఉంచి కుడి అరచేతితో కలశమును మూసి ....)

**నేను చేయు శ్రీ హనుమద్వ్రత పూజలో భాగముగా కలశపూజ చేయుచున్నాను.**

(అని పలుకుచూ అక్షతలు, నీరు పళ్ళెములో వదలి...)

**ముఖమునందు విష్ణువు, కంఠము నందు రుద్రుడు, మూలమునందు బ్రహ్మ, మధ్య భాగమున మాతృ గణములు వెలసియున్న ఓ కలశమా ! నీకు నమస్కారము.**

**కలశమునందు గల ఓ సాగరమా, ఓ గంగా, యమునా, సరస్వతీ, కృష్ణవేణీ, గోదావరీ, నర్మదా, సింధూ, కావేరీ ... మీకు నమస్కారములు. మీ అందరినీ యీ కలశమునందు గల జలముతో సాన్నిధ్యము చేయమని ప్రార్థిస్తున్నాను.**

(కలశములోని జలమును పువ్వులతో దేముని మీద, పూజా ద్రవ్యముల మీద, పూజలో పాల్గొంటున్న వారందరి మీద, తనమీద పరిసరముల మీద జల్లి నమస్కరించవలెను).

* * *

## గణపతి పూజ



(పసుపుతో విఘ్నేశ్వరుని చేసి ఒక తమలపాకును చివరికొన కలశమువైపు ఉండునట్లు బియ్యము సర్దిన ఒక పళ్ళెములో పెట్టి ఆ తమలపాకు మీద పసుపు గణపతిని పెట్టి కుంకుమతో బొట్లు పెట్టి నమస్కరిస్తూ యీ క్రింది విధముగా పలుకవలయును.)



శ్రీ మహా గణాధిపతే... స్థిరోభవ ... వరదోభవ ... సుముఖోభవ ... సుప్రసన్నోభవ ... స్థిరాసనం కురు.

### ధ్యానము

విఘ్నములను నివారించే వినాయకా ! మేము చేయు యీ పూజ స్వీకరించి మాయందు దయతో ఉండవలసిందిగా ప్రార్థన!

**శ్రీ మహా గణాధిపతయే నమః** ధ్యాయామి .. ఆవాహయామి ... రత్నసింహాసనం సమర్పయామి ... పాద్యం సమర్పయామి ... అర్ఘ్యం సమర్పయామి ... ఆచమనీయం సమర్పయామి ... స్నానం సమర్పయామి ... వస్త్రయుగ్మం సమర్పయామి ... యజ్ఞోపవీతం సమర్పయామి ... శ్రీ గంధం సమర్పయామి ... అక్షతాన్ సమర్పయామి ... పుష్పై పూజయామి

(పూలతోగాని, పత్రితోగాని, అక్షింతలతోగాని పూజ చేస్తూ యీ క్రింది నామములను పలుకవలయును.)

సుముఖాయ నమః । - ఏకదంతాయ నమః ।
కపిలాయ నమః । - గజకర్ణకాయ నమః ।
లంబోదరాయ నమః । - వికటాయ నమః ।
విఘ్నరాజాయ నమః । - గణాధిపాయ నమః ।
ధూమకేతవే నమః । - గణాధ్యక్షాయ నమః ।
ఫాలచంద్రాయ నమః । - గజాననాయ నమః ।
వక్రతుండాయ నమః । - శూర్పకర్ణాయ నమః ।
హేరంబాయ నమః । - స్కంద పూర్వజాయ నమః ।
సర్వ సిద్ధి ప్రదాయకాయ నమః ।

శ్రీ మహా గణాధిపతయే నమః

ధూపం ఆఘ్రాపయామి ... దీపం దర్శయామి ... ఆచమనీయం సమర్పయామి ... నైవేద్యం సమర్పయామి ... తాంబూలం సమర్పయామి ... నీరాజనం దర్శయామి ... సువర్ణమంత్రపుష్పం సమర్పయామి ...

(ఆత్మప్రదక్షిణ నమస్కారము అంటూ మన శరీరముతో అక్కడికక్కడే ప్రదక్షిణ చేస్తూ మన వెనుక భాగమును దేమునికి చూపించడము చాల తప్పు. అలాగే నిలబడి మన ఆత్మను దేమునికి ప్రదక్షిణ చేస్తున్నట్టుగా సంకల్పించవలెను.)

ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

## ప్రార్థన

శ్లో॥ వక్రతుండం మహాకాయం సూర్యకోటి సమప్రభం ।
అవిఘ్నం కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥

... ఇతి ప్రార్థనాం సమర్పయామి

ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాయా చ భగవాన్ సర్వాత్మకః

శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతో స్సుప్రసన్నో వరదో భవన్తు.

శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి ...

(గణపతి ప్రసాదమును తలలో పెట్టుకుంటూ గణపతిని కదుపుతూ ... పలకవలయును.)

గణపతిం యధాస్థానం ఉద్వాసయామి
శోభన కాలే పునః ఆగమానాయచ ।

* * *



## మంటప ఆరాధన

[కలశమును మంటపము మధ్యలో స్థాపన చేశాము. ఇప్పుడు పంచలోకపాలకులను, నవగ్రహములను, అష్ట దిక్పాలకులను, శ్రీ సీతారామచంద్రులను ఆహ్వానించి పూజించవలెను. ఒక్కొక్క దేవతను ఆహ్వానించినపుడు 'ఆవాహయామి' అంటూ ఆహ్వానించినట్టు సంకల్పించుచు తమలపాకును (చివరిభాగమును తూర్పు దిక్కుగా) మంటపములో పెట్టి దానిపై వక్కను ఆసనముగా భావించి పెట్టవలెను. 'స్థాపయామి' అంటూ లోహ నాణెమును (సదరు దేవతగా భావించుచు) వక్కపై ఉంచవలెను. 'పూజయామి' అంటూ పుష్పమును గాని అక్షతలతోగాని ఆ దేవతను పూజించవలెను.]

* * *

## పంచలోక పాలకుల పూజ

గణపతి, బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, గౌరీదేవీ, యీ అయిదుగురు లోక పాలకులు. వీరిని మంటపములో కలశము ప్రక్కన దక్షిణ దిక్కులో అనగా మన కుడిచేతివైపు పైనుండి క్రింద వరకు యీ క్రింది విధముగా ఆహ్వానించి ఆవాహన చేసి పూజించవలెను.



**1. గణపతి :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం 'గణపతిం' లోకపాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**2. బ్రహ్మ :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం 'బ్రహ్మాణాం' లోకపాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**3. విష్ణువు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం 'విష్ణుం' లోకపాలకం ఆవాహయామి స్థాపయామి పూజయామి.

**4. రుద్రుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం 'రుద్రం' లోకపాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**5. గౌరీ దేవి :** సాంగాం, సాయుధాం, స వాహనాం, స శక్తీం, పతీ పుత్ర పరివార సమేతం 'గౌరీం' లోకపాలకాం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

* * *

## ఆదిత్యాది నవగ్రహముల పూజ

(నవగ్రహములను మంటపములోనికి ఆహ్వానించునపుడు ఆ గ్రహ స్థానముల ప్రకారముగా తమలపాకు, వక్క, నాణెము పెట్టవలెను.)



| | | |
|---|---|---|
| బుధుడు | శుక్రుడు | చంద్రుడు |
| బృహస్పతి (గురుడు) | సూర్యుడు కలశం | అంగారకుడు |
| రాహువు | శని | కేతువు |

**1. సూర్యుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'సూర్య గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**2. చంద్రుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'చంద్ర గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**3. అంగారకుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'అంగారక గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**4. బుధుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'బుధ గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**5. బృహస్పతి :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'బృహస్పతి గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

6. **శుక్రుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'శుక్ర గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

7. **శని :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'శని గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

8. **రాహువు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'రాహు గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

9. **కేతువు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'కేతు గ్రహం' ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

***

## ఇంద్రాది అష్టదిక్పాలకుల పూజ

**(తూర్పు)**

| | | | | |
|---|---|---|---|---|
| **(ఈశాన్యము)** | **ఈశానము** | **ఇంద్రుడు** | **అగ్ని** | **(ఆగ్నేయము)** |
| **(ఉత్తరము)** | **కుబేరుడు** | **కలశం** | **యముడు** | **(దక్షిణము)** |
| **(వాయువ్యము)** | **వాయువు** | **వరుణుడు** | **నిఋతి** | **(నైఋతి)** |

**(పశ్చిమము)**



(తూర్పు దిక్కునకు ఎదురుగా కూర్చొని పూజ చేస్తున్నాము కనుక పైవిధముగా అష్టదిక్పాలకులను ఆహ్వానించవలెను.)

1. **ఇంద్రుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'ఇంద్రం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

2. **అగ్ని :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'అగ్నిం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

3. **యముడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'యమం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

4. **నిర్ఋతిం :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'నిర్ఋతిం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

5. **వరుణుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం 'వరుణం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

6. **వాయువు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'వాయుం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

7. **కుబేరుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'కుబేరుం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

**8. ఈశానము :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీ పుత్ర పరివార సమేతం 'ఈశానం' దిక్పాలకం ఆవాహయామి, స్థాపయామి, పూజయామి.

***

## శ్రీరామచంద్రుని పూజ



(సీతమ్మ, రామయ్య, లక్ష్మణుడు, భరతుడు, శత్రుఘ్నుడు, జాంబవంతుడు, మరియు సుగ్రీవాది ప్రముఖ వానరులు హనుమకు అత్యంత ప్రీతికరమైనవారు. అందుచేత వారందరితో కూడిన శ్రీరామచంద్రుని ధ్యానించి మంటపములోనికి 'కలశము ముందు' ఒక తమలపాకులో ఆహ్వానించి పూజించవలెను.)

ధ్యానం

శ్లో॥ వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితం
అగ్రేవాచయతి ప్రభంజన సుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే
శ్యామలమ్ ॥

భావము : పారిజాత వృక్షము క్రింద బంగారుమయమైన మహామంటపము మధ్యలో, మణులతో చెక్కబడిన పుష్పకము



మధ్యన ఉన్న ఆసనమునందు వీరాసనముతో కూర్చొని, మునుల కొఱకు ఆంజనేయస్వామి పరతత్త్వమును చెప్పుచుండగా ఆ తత్త్వమును వ్యాఖ్యానించుచున్న భరతాదులు మొదలగు వారిచే పరివృతంబయి ఉన్న శ్యామల వర్ణము కలిగిన శ్రీరామచంద్రుని సేవించుచున్నాను.

ఆహ్వానము, పూజ

సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న జాంబవాన్ సుగ్రీవాది ప్రముఖ వానరాన్ సమేత శ్రీహనుమత్ సేవిత శ్రీరామచంద్రాయ నమః

**శ్రీరామచంద్రుడు :** సాంగం, సాయుధం, స వాహనం, స శక్తిం, పత్నీపుత్ర పరివార సమేతం శ్రీరామచంద్రం ఆవాహయామి స్థాపయామి, పూజయామి.

***

## పంపానది పూజ

(రెండవ కలశమును ప్రధాన కలశము ప్రక్కన ఉంచి కొద్దిగా జలమును వేసి ఆ జలమును పంపానది జలముగా భావించి పూజించవలెను. అన్ని ఉపచారములు జలముతోనే చేయవలెను.)

ధ్యానము

శ్లో॥ హేమకూట గిరి ప్రాంత జనితాం పాపనాశనీం ।
పంపానదీం మహాపుణ్యాం స్మృత్వాచా
వాహయామ్యహమ్ ॥

పంపానదీయై నమః ... ధ్యానం సమర్పయామి ... ఆవాహనం సమర్పయామి ... ఆసనం సమర్పయామి ... పాద్యం

సమర్పయామి ... అర్ఘ్యం సమర్పయామి ... ఆచమనం సమర్పయామి .. పంచామృత స్నానం సమర్పయామి. శుద్ధోదక స్నానం సమర్పయామి ... వస్త్రయుగ్మం సమర్పయామి ... యజ్ఞోపవీతం సమర్పయామి ... గంధం సమర్పయామి ... అక్షతాన్ సమర్పయామి ... కుంకుమాన్ సమర్పయామి ... నేత్రాంజనం సమర్పయామి ... నానావిధ పరిమళ పత్రాన్ సమర్పయామి.

## అంగపూజ

హేమకూట పాదజాయై నమః - పాదౌ పూజయామి
శుభ్ర సలిలాయై నమః - గుల్ఫౌ పూజయామి
పాప హారిణ్యై నమః - జంఘే పూజయామి
సుభ్రువే నమః - జానునీ పూజయామి
ఉరు తరంగిణ్యై నమః - ఊరూ పూజయామి
తటిదుజ్జ్వల జలాయై నమః - కటిం పూజయామి
అంబుశోభిన్యై నమః - నితంబం పూజయామి
అణుమాధ్యాయై నమః - మధ్యం పూజయామి
సు స్తనాయై నమః - స్తనౌ పూజయామి
కంబుకంఠ్యై నమః - కంఠం పూజయామి
లలిత బాహు తరంగాయై నమః - బాహూ పూజయామి
దీర్ఘ వేణ్యై నమః - వేణీం పూజయామి
సు వక్త్రాయై నమః - వక్త్రం పూజయామి
కమల నేత్రాయై నమః - నేత్రౌ పూజయామి
దుర్వారవారి పుంగాయై నమః - శిరః పూజయామి



సహస్ర ముఖాయై నమః - సర్వాణ్యంగాని పూజయామి

పంపానదీయై నమః ధూపం ఆఘ్రాపయామి ... దీపం దర్శయామి ... నైవేద్యం సమర్పయామి ... తాంబూలం సమర్పయామి ... కర్పూర నీరాజనం సమర్పయామి ... సువర్ణ పుష్పం సమర్పయామి ... ప్రదక్షిణం సమర్పయామి ... క్షమాపణ నమస్కారం సమర్పయామి.

(పంపానది పూజ సమాప్తం)

* * *

(పంపానదిని పూజించిన కలశములోని జలమును ప్రధాన కలశములో వేసి 'స్థిరోభవ' అని అందులోని జలములకు నమస్కరిస్తూ ... యీ క్రింది విధముగా పలుకవలెను.)

ఓ జలములారా ! సకల జగత్తులకు జీవనాధారము, అమృతతుల్యము, పాప నాశనకరము, సర్వభూతముల అంతర్యామియగు చైతన్య స్వరూపము అయిన మీరు మా పాపములను ప్రక్షాళనము చేయవలసిందిగా కోరుతూ మిమ్ము యిప్పుడే ఆశ్రయించుచున్నాము.

(కలశములో పంచ పల్లవుల లేత చిగుళ్ళను గాని, లేతమామిడి ఆకులుగాని, తమలపాకులు గాని పెట్టి వాటిపై త్రిమూర్తి స్వరూపమైన కొబ్బరికాయను ముచ్చిక పైకి ఉండేలాగున పెట్టి పసుపురంగు (పట్టు) వస్త్రమును గోపురముగా చేసి కొబ్బరికాయపై పెట్టి తులసిమాల లేక పుష్పమాలతో అలంకరించి (13 ముదులు వేసిన తోరమును, శ్రీ ఆంజనేయ స్వామి (లోహ) ప్రతిమను కొబ్బరికాయపై గోపురమువలె

అలంకరించిన పసుపు రంగు పట్టు వస్త్రముపై (జారిపోకుండా) ఏర్పాటు చేయవలెను. మొత్తము పూజ శ్రీహనుమత్స్వరూపమైన తోరమునకే చేయవలయును. స్వామి (లోహ) ప్రతిమ ఆకర్షణకు మాత్రమే ! పూజలో పుష్పములు, పత్రములు తోరమునకు చూపించి కలశము మొదలులో ఉంచవలెను. ఇప్పుడు అనంతమైన ఫలితములను యిచ్చే ప్రధానమైన పూజ ప్రారంభమవుతున్నది.

పూజలో ఉపయోగించే పువ్వులు, తమలపాకులు, సింధూరము మొదలగునవి ఒక పళ్ళెములో పెట్టి పూజకు వచ్చిన వారందరి చేత పళ్ళెమును తాకి నమస్కరించమని చెప్పి తద్వారా పూజలో వారందరూ పాల్గొను భాగ్యము కల్పించవలెను. సర్వేజనాః సుఖినోభవంతు !)

***

## శ్రీ హనుమంతుని పూజ



శ్లో॥ మనోజవం మారుత తుల్యవేగం ।
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్టం ।
వాతాత్మజం వానరయూధ ముఖ్యం ।
శ్రీరామ దూతం శిరసా నమామి ॥

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః**



### ధ్యానము

శ్లో॥ అంజనా తనయం దేవం - మాయాతీతం జగద్గురం ।
ఏవం ధాత్వా హనూమంతం - పూజయేత్ శుద్ధ మానసః ॥

శ్లో॥ అథ ధ్యాయేత్ కపిశ్రేష్ఠం చతురావరణాన్వితం ।
వామ భాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలాం ॥

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ... ... ధ్యాయామి**

(రెండు నేత్రములు మూసి శిరస్సు వంచి హృదయముపై రెండు చేతులు అదిమి పట్టి ధ్యానించవలెను)

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః .... నవరత్న ఖచిత హేమ సింహాసనం సమర్పయామి.**

(పుష్పమును స్వామి వద్ద ఉంచి నమస్కరించవలెను.)

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ... పాద్యం సమర్పయామి.**

(స్వామి పాదములయందు ఉదకమును చూపి ప్రత్యేక తీర్ధ పాత్రలో పోయవలెను.)

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... అర్ఘ్యం సమర్పయామి.**

(స్వామి హస్తములయందు ఉదకమును చూపి ప్రత్యేక తీర్ధపాత్రలో పోయవలెను.)

**సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... ఆచమనీయం సమర్పయామి.**

(స్వామి ముఖమునందు ఉదకమును చూపి ప్రత్యేక తీర్ధపాత్రలో పోయవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... మధుపర్కం సమర్పయామి.

(మధుపర్కములు అనగా తేనె, పాలుగాని లేక పెరుగుగాని కలిపి లేదా పుష్పము సమర్పించవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... శుద్ధోదక స్నానం సమర్పయామి.

(స్వామికి ఉదకమును చూపి ప్రత్యేక తీర్థపాత్రలో వేయవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... వస్త్రయుగ్మం సమర్పయామి.

(వస్త్రద్వయమును లేదా పత్తిపోగులను లేదా పుష్పములను సమర్పించవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... సింధూర తిలకం సమర్పయామి.

(సింధూరమును స్వామి ప్రతిమకు పెట్టవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... యజ్ఞోపవీతం సమర్పయామి.

(యజ్ఞోపవీతము లేదా పత్తిపోగులను లేదా పుష్పములను సమర్పించవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... ఉత్తరీయం సమర్పయామి

(ఉత్తరీయమును లేదా పత్తిపోగులను లేదా పుష్పములను సమర్పించవలెను.)



సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... ఆభరణాని సమర్పయామి

(ఆభరణములను లేదా పుష్పములను సమర్పించవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... దివ్య శ్రీచందనం సమర్పయామి

(గంధమును సమర్పించవలెను.)

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ..... పుష్పాణి సమర్పయామి

(పుష్పములను సమర్పించవలెను.)

శ్రీ సువర్చలా సహిత హనుమతే నమః ..... అక్షతాన్ సమర్పయామి

(అక్షతలను సమర్పించవలెను.)

* * *

## తోరగ్రంధి పూజ

(కలశముపై ఉంచిన 13 ముడులు కలిగిన తోరమును త్రయోదశాక్షర హనుమత్ మంత్ర స్వరూపముగా భావిస్తూ ... తోరమునకు సింధూరముతో పూజ చేస్తూ...)

| | |
|---|---|
| ఓం అంజనాసూనవే నమః | - ప్రథమ గ్రంధిం పూజయామి |
| ఓం హనుమతే నమః | - ద్వితీయ గ్రంధిం పూజయామి |
| ఓం వాయు పుత్రాయ నమః | - తృతీయ గ్రంధిం పూజయామి |
| ఓం మహాబాలాయ నమః | - చతుర్థ గ్రంధిం పూజయామి |

ఓం రామేష్టాయ నమః - పంచమ గ్రంధిం పూజయామి
ఓం ఫల్గుణ సఖాయ నమః - షష్టమ గ్రంధిం పూజయామి
ఓం పింగళాక్షాయ నమః - సప్తమ గ్రంధిం పూజయామి
ఓం అమిత విక్రమాయ నమః - అష్టమ గ్రంధిం పూజయామి
ఓం కపీశ్వరాయ నమః - నవమ గ్రంధిం పూజయామి
ఓం సీతాశోక వినాశనాయ నమః - దశమ గ్రంధిం పూజయామి
ఓం లక్ష్మణ ప్రాణధాత్రే నమః - ఏకాదశ గ్రంధిం పూజయామి
ఓం దశగ్రీవ దర్పాఘ్నే నమః - ద్వాదశ గ్రంధిం పూజయామి
ఓం భవిష్యత్ బ్రహ్మణే నమః - త్రయోదశ గ్రంధిం పూజయామి

( అందరూ హృదయపూర్వకముగా ఆరాధనగా సర్వసమర్పణముగా చేతులు జోడించి
**'ఓం నమో భగవతే వాయునందనాయ'**
అని 13 పర్యాయములు స్వామి మూల మంత్రమును స్పష్టముగా పలకవలెను. )

* * *

### అథ అంగ పూజా

(కలశముపైనున్న తోరమునకు పుష్పములతో పూజ చేస్తూ ...)

మారుతయే నమః .. పాదౌ (పాదములు) పూజయామి.
సుగ్రీవ సఖాయ నమః .. గుల్ఫౌ (మడమలు) పూజయామి.
అంగద మిత్రాయ నమః .. జంఘే (పిక్కలు) పూజయామి.
రామ దాసాయ నమః .. ఊరూ (తొడలు) పూజయామి.
అక్షఘ్నాయ నమః .. కటిం (నడుము) పూజయామి.



లంకా దహనాయ నమః .. వాలం (తోక) పూజయామి.
సంజీవనీ నగాహర్త్రే నమః .. స్కంధౌ (భుజములు) పూజయామి.
సౌమిత్రి ప్రాణదాయ నమః .. వక్షస్థలం (ఛాతి) పూజయామి.
కుంఠిత దశకంఠాయ నమః .. కంఠం (మెడ) పూజయామి.
రామ అభిషేకకారిణే నమః .. హస్తౌ (చేతులు) పూజయామి.
మంత్రరచిత రామాయణాయ నమః .. వక్త్రం (నాలుక) పూజయామి.
ప్రసన్న వదనాయ నమః .. వదనం (ముఖం) పూజయామి
పింగళ నేత్రాయ నమః .. నేత్రౌ (కళ్ళు) పూజయామి.
శ్రుతి పారాయణాయ నమః .. శ్రోత్రే (చెవులు) పూజయామి.
ఊర్ధ్వ పుండ్రధారిణే నమః .. లలాటం (నుదురు) పూజయామి.
మణిరత్న కిరీట ధారియే నమః .. శిరః (శిరస్సు) పూజయామి.
భక్త అభీష్టప్రదాయ నమః .. సర్వాణ్యంగాని పూజయామి.

* * *

### అథ అష్టోత్తర శతనామ పూజ

(తమలపాకులతో లేక పుష్పములతో పూజ చేస్తూ ...)

1. ఓం ఆంజనేయాయ నమః
2. ఓం మహా వీరాయ నమః
3. ఓం హనుమతే నమః
4. ఓం మారుతాత్మజాయ నమః
5. ఓం తత్త్వజ్ఞాన ప్రదాయ నమః
6. ఓం సీతాదేవీ ముద్రాప్రదాయకాయ నమః

7. ఓం అశోకవనికాచ్ఛేత్రే నమః
8. ఓం సర్వ మాయా విభంజనాయ నమః
9. ఓం సర్వ బంధ విమోక్త్రే నమః
10. ఓం రక్షో విధ్వంసకారకాయ నమః
11. ఓం పర విద్యా పరీహారాయ నమః
12. ఓం పర శౌర్య వినాశకాయ నమః
13. ఓం పర మంత్ర నిరాకర్త్రే నమః
14. ఓం పర యంత్ర ప్రభేదకాయ నమః
15. ఓం సర్వ గ్రహ వినాశినే నమః
16. ఓం భీమసేన సహాయకృతే నమః
17. ఓం సర్వ దుఃఖ హరాయ నమః
18. ఓం సర్వ లోకచారిణే నమః
19. ఓం మనోజవాయ నమః
20. ఓం పారిజాతద్రుమూలస్థాయ నమః
21. ఓం సర్వ మంత్ర స్వరూపవతే నమః
22. ఓం సర్వ తంత్ర స్వరూపిణే నమః
23. ఓం సర్వ యంత్రాత్మికాయ నమః
24. ఓం కపీశ్వరాయ నమః
25. ఓం మహా కాయాయ నమః
26. ఓం సర్వ రోగ హరాయ నమః
27. ఓం ప్రభవే నమః
28. ఓం బల సిద్ధికరాయ నమః
29. ఓం సర్వ విద్యా సంపత్ర్పదాయకాయ నమః
30. ఓం కపిసేనా నాయకాయ నమః



31. ఓం భవిష్యత్ చతురాననాయ నమః
32. ఓం కుమార బ్రహ్మచారిణే నమః
33. ఓం రత్నకుండల దీప్తిమతే నమః
34. ఓం సంచలద్వాల సన్నద్ధ లంబమాన శిఖోజ్జ్వలాయ నమః
35. ఓం గంధర్వ విద్యా తత్త్వజ్ఞాయ నమః
36. ఓం మహా బల పరాక్రమాయ నమః
37. ఓం కారాగృహ విమోక్త్రే నమః
38. ఓం శృంఖలా బంధ విమోచకాయ నమః
39. ఓం సాగరోత్తారకాయ నమః
40. ఓం ప్రాజ్ఞాయ నమః
41. ఓం రామదూతాయ నమః
42. ఓం ప్రతాపవతే నమః
43. ఓం వానరాయ నమః
44. ఓం కేసరీ సుతాయ నమః
45. ఓం సీతాశోక నివారకాయ నమః
46. ఓం అంజనాగర్భ సంభూతాయ నమః
47. ఓం బాలార్క సదృశాననాయ నమః
48. ఓం విభీషణ ప్రియకరాయ నమః
49. ఓం దశగ్రీవ కులాంతకాయ నమః
50. ఓం లక్ష్మణ ప్రాణదాత్రే నమః
51. ఓం వజ్ర కాయాయ నమః
52. ఓం మహా ద్యుతయే నమః
53. ఓం చిరంజీవినే నమః
54. ఓం రామ భక్తాయ నమః

55. ఓం దైత్య కార్య విఘాతకాయ నమః
56. ఓం అక్ష హంత్రే నమః
57. ఓం కాంచనాభాయ నమః
58. ఓం పంచ వక్త్రాయ నమః
59. ఓం మహా తపసే నమః
60. ఓం లంకిణీ భంజనాయ నమః
61. ఓం శ్రీమతే నమః
62. ఓం సింహికా ప్రాణ భంజనాయ నమః
63. ఓం గంధమాదన శైలస్థాయ నమః
64. ఓం లంకాపుర విదాహకాయ నమః
65. ఓం సుగ్రీవ సచివాయ నమః
66. ఓం ధీరాయ నమః
67. ఓం శూరాయ నమః
68. ఓం దైత్య కులాంతకాయ నమః
69. ఓం సురార్చితాయ నమః
70. ఓం మహా తేజసే నమః
71. ఓం రామ చూడామణి ప్రదాయ నమః
72. ఓం కామరూపిణే నమః
73. ఓం పింగళాక్షాయ నమః
74. ఓం వార్ధిమైనాక పూజితాయ నమః
75. ఓం కబళీకృత మార్తాండ మండలాయ నమః
76. ఓం విజితేంద్రియాయ నమః
77. ఓం రామ సుగ్రీవ సంధాత్రే నమః
78. ఓం మహా రావణ మర్ధనాయ నమః



79. ఓం స్ఫటికాభాయ నమః
80. ఓం వాగధీశాయ నమః
81. ఓం నవ వ్యాకృతి పండితాయ నమః
82. ఓం చతుర్బాహవే నమః
83. ఓం దీన బంధవే నమః
84. ఓం మహాత్మనే నమః
85. ఓం భక్త వత్సలాయ నమః
86. ఓం సంజీవన నగాహర్త్రే నమః
87. ఓం శుచయే నమః
88. ఓం అగ్నయే నమః
89. ఓం దృఢ వ్రతాయ నమః
90. ఓం కాలనేమి ప్రమథనాయ నమః
91. ఓం హరి మర్కట మర్కటాయ నమః
92. ఓం దాంతాయ నమః
93. ఓం శాంతాయ నమః
94. ఓం ప్రసన్నాత్మనే నమః
95. ఓం శత కంఠ మదాపహృతే నమః
96. ఓం యోగినే నమః
97. ఓం రామ కథా లోలాయ నమః
98. ఓం సీతాన్వేషణ పండితాయ నమః
99. ఓం వజ్ర దంష్ట్రాయ నమః
100. ఓం వజ్ర నఖాయ నమః
101. ఓం రుద్ర వీర్య సముద్భూతాయ నమః
102. ఓం ఇంద్రజిత్ప్రహితామోఘ బ్రహ్మాస్త్ర నివారకాయ నమః

103. ఓం పార్ధ ధ్వజాగ్ర సంవాసినే నమః
104. ఓం శర పంజర భేదకాయ నమః
105. ఓం దశ బాహవే నమః
106. ఓం లోక పూజ్యాయ నమః
107. ఓం జాంబవత్ప్రీతి వర్ధనాయ నమః
108. ఓం సీతా సమేత శ్రీరామ పాదసేవా దురంధరాయ నమః

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః
నానావిధ పరిమళ పత్ర పుష్ప అక్షతాన్ సమర్పయామి.

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః .... ధూపం అఘ్రాపయామి.

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ... దీపం దర్శయామి
ధూపదీపం అనంతరం శుద్ధ ఆచమనం సమర్పయామి.

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః ... అనేక ఫల, భక్ష్య, భోజ్య మహా నైవేద్యం సమర్పయామి.
శుద్ధ ఆచమనం సమర్పయామి

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః .... ముఖ ప్రీత్యర్థం తాంబూలం సమర్పయామి

శ్లో॥ మంగళము కపిలోత్తమ ।
మంగళము సువర్ణదేహ మహిమలకెల్లన్ ।
మంగళము పింగళాక్షుడ
మంగళమే నీకు కల్గు మహిలో నెపుడున్ ॥



సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః .... మంగళ నీరాజనం సమర్పయామి
శుద్ధ ఆచమనీయం సమర్పయామి

సువర్చలా సహిత శ్రీ హనుమతే నమః .... అనేక వేల సువర్ణ దివ్య మంత్ర పుష్పాన్ సమర్పయామి
ఛత్రం చారయామి - చామరం వీజయామి
గీతం సమర్పయామి - నృత్యం దర్శయామి
సమస్త సర్వోపచార దేవోపచారాన్ సమర్పయామి
ఉష్ట్ర (ఒంటె) వాహన ఆరోహణం సమర్పయామి
గజారోహణం సమర్పయామి
ఆనంద డోలికాది (పల్లకి) సర్వోపచారాన్ సమర్పయామి

పంపానదీ తీర నివాస సువర్చలా సహిత
శ్రీ హనుమత్ దేవతా ప్రీతి రస్తు !

**క్షమా ప్రార్థన**

మంత్రహీనం క్రియా హీనం భక్తిహీనం కపీశ్వర
యత్పూజితం కురుమేదేవ సర్వకార్యేషు సర్వధా
అహంబో అభివాదయే

(నీకు శరణు నన్ను కరుణించు అంటూ మగవారు సాష్టాంగ నమస్కారములు ఆడవారు ముదుకులు మీద వంగి నమస్కారములు చేయవలెను.)

శ్లో॥ కాయేన వాచా మనసేంద్రియైవా
బుధ్యాత్మనావా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి

సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సేవిత
శ్రీరామచంద్ర ప్రభు పాదారవింద అర్పణమస్తు !

సర్వం శ్రీకృష్ణార్పణమస్తు !

* * *

## తోరము ధరించుట

శ్లో॥ పుత్రాది సమస్త భాగ్యంచ వాంఛంతి వాయునందనాః ।
పూజ్య త్రయోదశ గ్రంధియుతం బధ్నంతి కంకణదోరగం ॥

(ఇప్పుడు త్రయోదశ అక్షర హనుమాన్ మంత్ర స్వరూపమైన తోరమును భక్తి శ్రద్ధలతో తీసుకొని రెండు నేత్రములకు అద్దుకొని మూల మంత్రమగు 'ఓం నమో భగవతే వాయు నందనాయ' ను 13 పర్యాయములు స్పష్టముగా పలికి మీకు ప్రియమైన పెద్దలచే కట్టించుకొనవలెను.)

శ్లో॥ హనుమన్ ఇతిమే స్నానం - హనుమన్ ఇతి మే జపః
హనుమన్ ఇతిమే ధ్యానం - హనుమన్ కీర్తయే సదా ॥

(గంధమాదనుడు - వానర గీత)

తా॥ హనుమ నామమే నా స్నానం, హనుమ నామమే నా జపము. హనుమ నామమే నా ధ్యానము. హనుమను ఎల్లప్పుడూ కీర్తించుచుందును.



# శ్రీ హనుమద్వ్రత కల్పము

# వ్రత కథలు

## మొదటి అధ్యాయము

పూర్వము నైమిశారణ్యములో గంగాతీరమందు వేద వేదాంగ పారగులు అయిన శౌనకాది మహా మునులు వేదవ్యాసుల వారి ముఖ్య శిష్యులు, సర్వ పురాణవేత్త అయిన సూత మహామునిని చేరి నమస్కరించి ఓ సూత మునీంద్రా ! మీ దయవలన వాసుదేవుని కథలను, వ్రతములను అనేకము వింటిమి. ఈ దినము మరియొక మహత్తరమైన వ్రతమును చెప్పండి' అని అడిగారు.

ఓ మునీంద్రులారా ! నాలుగు వర్ణములు వారికి ఆచరించతగినదియు, రహస్యమైనదియు, శక్తివంతమైనదియు, మంగళప్రదమైనదియు, వశ్య - మోహన - ఉచ్ఛాటన - స్థంబన - విద్వేషణాది కార్యములను నియంత్రించగలదియు సకల మనోరథములను తీర్చగలదియు అగు ఒక వ్రతమును వివరముగా చెప్పుచున్నాను అంటూ సూతముని చెప్పసాగెను.

ధర్మరాజు కౌరవులతో జూదమాడి ఓడిపోయి రాజ్యమును, సర్వమును కోలుపోయి 12 సంవత్సరములు అరణ్యావాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము గడుపుటకై భార్యా, సోదరులతో ద్వైత వనమున భగవత్ చింతనతో కాలము గడుపుచుండెను. ఆ సమయములో ఒకనాడు వ్యాస మహర్షులవారు తన శిష్యులతో ధర్మరాజును చూచుటకై ఏతెంచెను.

ధర్మరాజు, భార్యా సోదరుల సమేతముగా ఎదురేగి వ్యాసమహర్షిని సవినయముగా ఆహ్వానించి సకల విధులతో పూజించెను. ధర్మరాజు

ఆతిధ్యమునకు వ్యాసమహర్షి తృప్తిచెంది, ఓ ధర్మరాజా ! మీ కష్టములు తీరి మీ రాజ్యము, సంపదలు మళ్ళీ మీకు సంప్రాప్తించ గలిగే సాధనమైన మహత్తరమైన హనుమద్వ్రతమును చెప్పెదను.

ఒకానొక సమయమందు శ్రీకృష్ణపరమాత్మ ద్రౌపతీదేవి కోరికపై యీ హనుమద్వ్రతమును ఉపదేశించెను. ద్రౌపతీదేవి యీ వ్రతము ఆచరించి వ్రత తోరమును ధరించుట చేత మీరు సకల సంపదలను రాజ్యమును పొందినారు. ఒకానొక సమయమందు ద్రౌపతీదేవి ధరించిన తోరమును చూచి అర్జునుడు ఆశ్చర్యముతో యీ తోరముయేమిటి? అని అడుగగా శ్రీకృష్ణుడు ఉపదేశించగా తాను హనుమద్వ్రతమును ఆచరించి ఆ వ్రతములో భాగముగా యీ తోరమును ధరించితినని ద్రౌపతీ దేవి తెలిపెను. అంత అర్జునుడు కోపముతో, ఆ శ్రీకృష్ణుడు నీకు పరిహాసముగా చెప్పినాడు. నా యొక్క రధముపై జెండాయందు కట్టబడినవాడు, వనమాలీ అయిన హనుమంతుడు మనకు యేమి యివ్వగలడు. ఇది మాకు అవమానము. తక్షణమే ఆ తోరమును తీసి వేయుము అని ఆదేశించగా గత్యంతరము లేక ద్రౌపతీదేవి వ్రత ఉద్యాపనము చేయకనే తోరమును విసర్జించెను. ఓ ధర్మరాజా ! 13 ముడులు కలిగిన హనుమద్వ్రత తోరమును ద్రౌపతీదేవి విసర్జించుట చేత మీరు 13 సంవత్సరములు అరణ్య, అజ్ఞాత వాసములు చేయవలసి వచ్చెను. అని వ్యాసులవారు తెలుపగా అక్కడే ఉన్న ద్రౌపతీదేవి నిజమేనని తెలిపెను.

అపుడు వ్యాసమహర్షి ఓ ధర్మరాజా ! ఇంకొక విషయమును చెప్పెదను వినుమని చెప్పసాగెను. పూర్వము లక్ష్మణునితో శ్రీరాముడు సీతను వెతుకుచు ఋష్యమూక పర్వతము సమీపించగా హనుమంతుడు కలసి సుగ్రీవునితో సఖ్యము చేయించెను. ఒకనాడు హనుమంతుడు



శ్రీరామునితో ఓ శ్రీరామచంద్రప్రభూ ! నేనొక యదార్ధ విషయమును చెప్పుచుంటిని. దయచేసి వినండి. నేను పుట్టిన కొద్ది దినములలోనే సూర్యుడిని పండుగా భ్రమించి మ్రింగబోగా ఇంద్రుడు వజ్రాయుధముతో నా హనువునందు కొట్టగా నేను స్పృహ కోల్పోవగా నాతండ్రి వాయుదేవునకు కోపము వచ్చి నన్ను తీసుకొని యెవరికినీ కానరాక దాగియుండెను. ఆ సమయమందున లోకములలో గాలి ఆడక జీవులన్నియు కటకటలాడిపోగా బ్రహ్మాది దేవతలందరూ ప్రత్యక్షమై నాకు చిరంజీవి అనియు, విశేష పరాక్రమశాలివి అనియు, నిన్ను గుఱించి హనుమద్వ్రతమును భక్తి శ్రద్ధలతో యెవరు ఆచరింతురో వారి వారి కార్యములు నిర్విఘ్నముగా సిద్ధించుననియు వరములను యిచ్చిరి. అపుడు సీతాన్వేషణ చేయుచూ నిన్ను కలిసిన శ్రీరాముడు నీవ్రతమును చేసి సఫలీకృతుడు కాగలడు అని బ్రహ్మ పలికెను. శ్రీరామచంద్ర ప్రభూ! ఆ విషయము నాకు యిపుడు జ్ఞప్తికి వచ్చెను. కావున మీకు యిష్టమయ్యేనేని యీ వ్రతము చేయవలసిందిగా కోరుతున్నాను. ఈ విధముగా హనుమ పలుకగానే అశరీరవాణి ఓ రామచంద్రా ! ఇది సత్యమని పలికింది. ఆకాశవాణి పలుకులను విన్న శ్రీరాముడు వ్రతము చేయ నిశ్చయించుకొని హనుమా ! ఆ వ్రతము ఆచరించు విధానమేమిటి? ఎప్పుడు ఆచరించవలెను? అని అడిగెను. అపుడు హనుమంతుడు ప్రభూ ! మార్గశిర శుద్ధ త్రయోదశి రోజున బంగారముతో గాని వెండితో గాని, రాగితో గాని, ఇత్తడితోగాని, మట్టితోగాని చేసిన కలశమందు జలము వేసి పంచ పల్లవులు పెట్టి కొబ్బరికాయపెట్టి పసుపు వస్త్రముతో అలంకరించి 13 ముడులు కలిగిన పసుపు తోరమును కలశము పైన ఉంచి ఆ తోరము మీద **'ఓం నమో భగవతే వాయునందనాయ'** అను 13 అక్షరముల మంత్రముతో పసుపురంగు

గంధముతోను, పుష్పములతోను నన్ను ఆవహింప చేసి షోడశ ఉపచారములతో పూజించవలెను. అనంతరము 13 అప్పములు గాని, వడలు గాని, లడ్లు గాని, ఫలములు గాని వాయనము యిచ్చి భక్తులతో కలసి భోజనము చేయవలెను. ఈ విధముగా యీ వ్రతమును 13 పర్యాయములు నియమముతో చేయవలెను. వ్రతముల ప్రారంభమున గాని, మధ్యనగాని, అంతమందుగాని ఉద్యాపనము చేయవలెను అని వివరించెను. శ్రీరాముడు ఆ వ్రతమును ఆచరించగా స్వయముగా హనుమంతుడే నూరు యోజనముల సాగరమును దాటి లంకలో సీతమ్మను కనుగొని శ్రీరామునకు ఆనందము కలుగజేసెను. అప్పటినుండి ఈ వ్రతము భూలోకమున ప్రసిద్ధి చెందెను.

కావున ఓ ధర్మరాజా ! నీవును యీ వ్రతమును చేసి సత్ఫలితములను పొందుము అని వ్యాసుల వారు చెప్పగా ఆ మరునాడు ధర్మరాజు పత్నీసమేతుడై యీ వ్రతమును చేసి సంవత్సరము లోపునే రాజ్యమును పొందెను.

**హనుమద్వ్రత కల్పములో మొదటి అధ్యాయము సమాప్తము.**

(శక్త్యానుసారము నివేదనము చేసి హారతి యివ్వవలెను)

**శ్లో॥ హనూమాన్ కల్పవృక్షో మే హనుమాన్ కామధేనుః ।**
**చింతామణిస్తు హనుమాన్ కో విచారః కుతోభయమ్ ॥**

తా॥ నాకు హనుమంతుడే కల్పవృక్షము, హనుమంతుడే కామధేనువు, హనుమంతుడే చింతామణి గాన విచారము లేదు, భయము లేదు.

(మైత్రేయ - పరాశర సంవాదము)



# శ్రీ హనుమద్వ్రత కల్పము
## వ్రత కథలు
## రెండవ అధ్యాయము

సూతుడిట్లు చెప్పుచున్నాడు. ఓ ఋషీశ్వరులారా ! పరాశరమహర్షి మైత్రేయునకు ఉపదేశించిన హనుమద్వ్రతకథను మరి ఒక దానిని చెప్పుచున్నాను సావధానముగా వినవలసిందిగా కోరుతున్నాను.

మైత్రేయుడు ఒకానొక సమయమునందు పరాశరమునీంద్రుని చూచి, ఓ మునీంద్రా ! మీ దర్శనముచే నేను త్రికాలములందు ధన్యుడనైతిని. సాంసారిక గాథయను గ్రీష్మతాపముచే నా దేహమంతయు బాహ్యాభ్యంతరములందు వేడి కలిగినది. హనుమత్కథామృతములో నా దేహమును ముంచవలసిందిగా ప్రార్థిస్తున్నాను. హనుమ అనుగ్రహపాత్రులయిన మీకు తెలియని విషయము ముల్లోకములలోను, మూడు కాలములలోను లేదు.

ఈ హనుమద్వ్రతమును యింకెవరు ఆచరించి యేమి ఫలితములను పొందితిరో దయచేసి చెప్పవలసిందిగా కోరుతున్నాను అని అడుగగా పరాశరమహర్షి గగురుపాటుతో పరమానందపాత్రుడగుచు మైత్రేయుని జూచి, ఓ మునీంద్రా ! మనోవాక్కాయములచే యితర విషయములను విడచి రాత్రింబవళ్ళు హనుమత్కథా గోష్ఠియందు మునుగుదుము గాన మనమిద్దరము ధన్యులమైతిమి. ఆలసించక పవిత్రమగు హనుమత్కథను క్రమముగా తెల్పెదను సావధానముగా వినుము అని పలికి చెప్పసాగెను.

సోమవంశోత్పన్నుడు, ధర్మము కలవాడు, సత్యసంధుడు, అహంకారము లేనివాడు, మునులను అతిథులను పూజించువాడు.

శత్రువులను అణచుటయందు పరాక్రమము కలవాడు, సముద్ర ముద్రితమగు భూమండలమందు మహీష్మతీ పురమును రాజధానిగా ఏకఛత్రాదిపత్యముగ యేలినవాడు అగు సోమదత్తుడు అనే పేరుగల ఒకరాజు గలదు.

కర్మవశాత్తూ సోమదత్తుని శత్రురాజులందరూ కలసి మహీష్మతీ పురమును అకస్మాత్తుగా ముట్టడించిరి. పూర్వము దేవాసురులకు యే విధముగా యుద్ధము జరిగెనో ఆ విధముగా సోమదత్తునికీ, శత్రురాజులకూ భయంకరమైన యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో సోమదత్తుడు పరాజితుడై భార్య దేవిక సమేతముగా రహస్యమార్గమున రాజ్యమును వీడి రాజ్య సరిహద్దులలో ఉన్న అరణ్యములో తిరుగుచుండెను.

రాజ్య భ్రష్టుడై కుమారులను కోల్పోయి, నిరంతరము శోక సముద్రములో మునిగిపోయి కృంగిపోతున్న భర్తను చూచి సోమదత్తుని భార్యయగు దేవిక భర్తను ఊరడించుచూ, ఓనాథా ! ఆపదలు సంభవించినపుడు ధైర్యము, ఓర్పు, కలిగియుండుట రాజలక్షణము. సంపత్తులు రా దలచిన కొబ్బరికాయలో నీరు వలె వచ్చును. పోదలచినపుడు యేనుగు తిన్న వెలగపండులోని గుంజువలె పోవును. చితి అనునది శవమును ఒక్కసారే కాల్చివేయును. కాని చింత అనునది జీవించియుండగా జీవితాంతం కాల్చును. జరుగనున్నది జరుగక మానదు అని సమాధానపడిన వారిని చింతయనునది బాధింపదని నీతి శాస్త్రజ్ఞులు చెప్పుదురు. కావున స్వస్థ చిత్తుడవగుమని పరిపరి విధముల ఊరడించుచూ నడచుటకు శక్తి లేని భర్తను భుజములపై కూర్చుండ పెట్టుకొని ప్రయాణము చేయుచూ కొన్నాళ్ళకు గార్గ్య ముని ఆశ్రమమునకు చేరెను.

పతి దీనావస్తను యేకరువు పెడుతూ భర్తను రక్షింపుడని గార్గ్య మహామునిని వేడుకొనగా గార్గ్య మహాముని తన జ్ఞాన దృష్టి చేత



సర్వమును తెలుసుకొని సోమదత్తునితో ఓ మహారాజా ! ప్రజారంజకముగా రాజ్యపరిపాలన చేసియూ ఉత్తమ విద్యోపాసన చేయక పోవడము వలనను, ఉత్తమ వ్రతమును ఆచరించక పోవుట వలనను యీ కష్టము సంభవించినది అని పలికెను.

గార్గ్య మహాముని పలుకులను విని సోమదత్తుడు, ఓ మహాత్మా ! సర్వము కోల్పోయి అశక్తుడనైన నాకు కర్తవ్యము తెలియజేయండి. విధి విలాసము వలన నాకు భవిష్యత్తు శూన్యముగా ఉన్నది అని ప్రార్థింపగా గార్గ్యమహాముని, ఓ మహారాజా ! నీకు కలిగిన ఆపదలు అన్నీ తొలగి నీ రాజ్యము నీకు తిరిగి సంప్రాప్తించే ఉపాయము కలదు. అది పంచముఖ హనుమను పూజిస్తూ హనుమద్వ్రతమును ఆచరించాలి అని పలుకగా సోమదత్తుడు, ఓ మహాత్మా ! అంతటి మహిమాన్వితమైన ఆ హనుమద్వ్రతము యిప్పుడే చేసే అవకాశము మాకు ఉన్నదా ? మా చేత తక్షణమే చేయించగలరా? ఆవ్రత నియమములు మేము పాటించగలమా? అని ఆతృతగా అడిగాడు. అంత గార్గ్య మహాముని మందహాసముతో ఓ మహారాజా ! హనుమద్వ్రతమును వైశాఖ కృష్ణ (బహుళ) దశమి నాడు గాని అమావాస్యనాడు గాని, మాఘాది పంచమాసములలో వచ్చు మొదటి శనివారమునాడుగాని, మృగశిర నక్షత్రముగాని, శ్రావణ పౌర్ణమినాడు గాని, కార్తీక శుద్ధ ద్వాదశి నాడుగాని, మార్గశిర శుద్ధ త్రయోదశి నాడుగాని ఆచరించవచ్చును. భక్తి కలవారు సమస్త దివసములందు ఆచరించవచ్చును.

నిత్యము ఆచరించువారు వ్రత ప్రారంభమునందే తోరమును ఉంచినవారై పూజ చేయవచ్చును. తోరమును మార్చనక్కరలేదు. సంవత్సరమును ఒకసారి ఆచరించినవారు మాత్రము పూర్వము ధరించిన తోరమును విడిచి కొత్త తోరమును ధరించవలెను.

బ్రహ్మ ముహూర్తమందు గాని, సాయం మధ్యాహ్న ప్రాతః కాలముల యందుగాని గురువు ఆదేశముతో చేయవచ్చును.

బంగారము, వెండి, రాగి మొదలగు యంత్రములయందుగాని, భూర్జపత్రమునందుగాని, తాళపత్రమునందుగాని, పిండితో లేక పసుపుతో చేసిన యంత్రమందు గాని, ప్రత్యేకము ఉదక పూరితమైన కలశమందుగాని, పట్టుగుడ్డ యందుగాని, ప్రతిమయందుగాని, చిత్రపటమందు గాని పూజించవచ్చును. ప్రత్యేకించి పదమూడు ముళ్ళు కలిగిన పచ్చని తోరమందు పూజించవలెను. నేతితో వండిన పదమూడు అపూపములను వాయనదానము చేయవలెను. గురువును ద్రవ్య వస్త్రాదులచే పూజించవలెను. భక్తులతో సమారాధనము చేయవలెను. ఈ ప్రకారము పదమూడు సంవత్సరములు గాని పదమూడు పర్యాయములు గాని పూజించవలెను. ఈ వ్రత ప్రారంభమునదే సకల కార్యములు సిద్ధించును. అని చెప్పిన గార్గ్యమహాముని యొక్క పలుకులను విన సోమదత్త మహారాజు భార్యతో పంచముఖ హనుమ విద్యను స్వీకరించి గురు సహాయముతో పర్యవేక్షణతో హనుమద్వ్రతమును భక్తిప్రపత్తులతో ఆచరించెను. ఆ ప్రభావము వలన దివ్యకాంతిగల శరీరమును పొంది శత్రువులను జయించి గార్గ్యమహామునిని తన గురువుగా చేసుకొని పదమూడు సంవత్సరములు వరుసగా హనుమద్వ్రతమును ఆచరించి ముప్పది వేల సంవత్సరములు రాజ్యమును పాలించి 8 మంది పుత్రులను కని పెద్ద కుమారునకు రాజ్య పట్టాభిషేకము చేసి భార్యా సమేతముగా బ్రహ్మలోకమును పొందెను.

ఈ ప్రకారముగా పరాశర మహర్షి మైత్రేయునకు చెప్పెనని సూతుడు మహర్షులకు చెప్పెను. మహర్షులందరూ పరమానందము పొంది సూతునికి కృతజ్ఞతలు తెలిపిరి.

**హనుమద్వ్రత కల్పములో రెండవ అధ్యాయము పూర్తి అయినది.**

(శక్త్యానుసారము నివేదనము చేసి హారతి యివ్వవలెను)



# శ్రీ హనుమద్వ్రత కల్పము

## వ్రత కథలు

### మూడవ (తృతీయ) అధ్యాయము

(పరాశర మహర్షి మైత్రేయునకు తెలిపిన హనుమద్వ్రత కథలను శౌనకాది మహామునులకు సూత మహర్షి తెలిపిన విధానము).

ఓ మైత్రేయ మహామునీ ! పూర్వము నందు జరిగిన అద్భుత చరిత్రను చెప్పుచుంటిని సావధానముగా వినుము.

లంకాధీశుడు రావణాసురుడి సోదరుడైన విభీషణునకు నీలుడు అనే కుమారుడు కలడు. అతను సమస్త విద్యలందును పరిపూర్ణుడు, సమస్త ధర్మములను తెలిసినవాడు.

ఆ నీలుడు తండ్రియగు విభీషణుని చూచి, హే ప్రభూ ! మన లంకానగరము ధనధాన్యాదులు, నవరత్నములతో, మహదైశ్వర్యముతో తులతూగుచున్నది. కాని చింతామణి, కామధేనువు, కల్పవృక్షము లేక వెల్తిగా ఉన్నది. తండ్రీ ! మీరు శ్రీరామచంద్రుని యొక్క పాదాంబుజ సేవ చేత మహదైశ్వర్యమును పొంది మహారాజులయినప్పటికీ చింతామణి మొదలగునవి సంపాదించలేక పోతిరి అని అనగా విభీషణుడు, కుమారా! శ్రీరామచంద్రుని అనుగ్రహము చేత దీర్ఘాయుష్యమునూ సామ్రాజ్యమును పొందితిని. ఇంద్రాది దిక్పాలకులూ ఆకారణము చేతనే మనకు అనుకూలముగా వర్తించుచున్నారు. నాకు సమస్తము శ్రీరామచంద్రుడే! నా దృష్టిలో చింతామణి మొదలగునవి అల్పములే ! అని సమాధానమిచ్చెను. నీలుడు నెమ్మదిగా, తండ్రీ ! మీరు అనుమతించిన చింతామణిని, కామధేనువును, కల్పవృక్షమును సంపాదించవలెనని కోరికగా ఉన్నది అని పలికెను. విభీషణుడు కొంత తడవు ఆలోచించి అవి సంపాదించగలిగిన తన కుమారునకు కీర్తిరాగలదని తలచి

కుమారా ! చింతామణి మొదలగునవి స్వర్గములో దేవతల వద్ద ఉన్నవి. గురువు సేవలు చేసి ఆయన అనుగ్రహముతో దేవతారాధన చేసినచో వాటిని పొందగలవు అని చెప్పగా నీలుడు తండ్రికి నమస్కరించి తండ్రి ఆశీర్వాదములను గైకొని రాక్షస కులగురువైన శుక్రాచార్యుల సన్నిధికి చేరి 12 సంవత్సరములు అనేకవిధముల భక్తి శ్రద్దలతో శుక్రాచార్యులను సేవించగా ఆయన సంతృప్తి చెంది నీలుని కోరికను గ్రహించి, నాయనా నీలా ! నీ కోరిక తీరుటకు సమస్త విద్యలలో ఉత్తమమైన విద్యను, వ్రతములలో ఉత్తమమైన వ్రతమును నీకు ఉపదేశించెదను. రేపు మృగశిరా నక్షత్రయుక్తమైయున్నది. ఆ నక్షత్రము హనుమద్వ్రతమును చేయుటకు శ్రేష్ఠమైనది కనుక పంచముఖ హనుమదారాధననూ, వ్రతమునూ నీకు ఉపదేశించెదను అని పలికి ఆ మరునాడు నీలుని చేత హనుమద్వ్రతమును చేయించెను. శుక్రాచార్యుల వారిని ఘనముగా సత్కరించి నీలుడు ఆయన సేవలు చేయుచు ఆయన ఉపదేశించిన హనుమన్మంత్రమును ఏక భుక్తి, బ్రహ్మచర్యాది నియమములతో జపించుచుండగా ఆంజనేయస్వామి సంతసించి ప్రత్యక్షమై నీలుని మనోరథము నెరవేరునని అభయము నిచ్చి తల్లితండ్రుల సేవింపుమని చెప్పి అదృశ్యమాయెను. నీలుడు పరమానందముతో గురువుగారి వద్ద శెలవు తీసుకొని తల్లితండ్రుల చేరి వారిని సేవించుచూ నిత్యము హనుమన్మంత్రమును జపించుచు తపః సంపన్నుడై చింతామణి మొదలగునవి సంపాదించుటకు పురుష ప్రయత్నము చేసే సమయము ఆసన్నమైనదని భావించి తనకు చింతామణి, కామధేనువు, కల్పవృక్షములను పొందవలెనని కోరికగా ఉన్నందున వాటిని తనకు అప్పగించవలసిందిగా లేనిచో యుద్ధమునకు సిద్ధమవవలసిందిగా దూతను దేవేంద్రుని వద్దకు పంపెను. నీలుని దూత చెప్పినది విని దేవేంద్రుడు కోపోద్రేకములతో ఎంతోమంది రాక్షసులను సంహరించిన తనకు నీలుడు యేపాటివాడు? అని పలుకుచూ నీలునకు సమాధానముగా నీలుని దూతకు (శిఖాచ్ఛేదనము) తలగొరిగించి అవమానించి పంపెను.



అంత నీలుడు కోపముతో దేవేంద్రునిపై సమరమునకు వెళ్ళెను. దేవదానవులకు భయంకరముగా యుద్ధము జరుగుతుండగా బ్రహ్మదేముడు ప్రత్యక్షమై యుద్ధమును ఆపి నీలునకు యింద్రునకు సంధిని చేసి నీలునితో, ఓ నీలుడా ! విష్ణుమూర్తికి నీతండ్రి మహాభక్తుడు. విష్ణుమూర్తికి ఇంద్రుడు అన్నగారు అందుచేత ఇంద్రునితో సఖ్యముగా ఉండవలెను అని పలికి ఇంద్రునితో ఓ దేవేంద్రా ! వజ్రాయుధమును విడిచి నీలునితో స్నేహము చేయుము. చింతామణిని, కామధేనువును, కల్పవృక్షమును నీలునకు అప్పగించుము అని ఆదేశించెను. బ్రహ్మదేవుని ఆదేశముపై దేవేంద్రుడు ఆ మూడింటిని నీలునకు అప్పగించెను. బ్రహ్మదేముడు నీలునితో, ఓ విభీషణు కుమారుడా ! నీవు మృగశిరా నక్షత్రమందు గురువు సాన్నిధ్యములో పంచ ముఖ హనుమద్విద్యను, హనుమద్వ్రతమును ఆచరించినందువలన నీకు సాధించలేనిది ఏదియు లేదు. పూర్వము అత్రి మహాముని తపః ప్రభావముతో ఆయన నేత్రమునుండి దివ్యమైన తేజస్సు వెడలినది. వాయుదేవుడు ఆ తేజస్సును రెండుగా విభజించగా ఒకదానియందు చంద్రుడు, రెండవదానియందు త్రిలోక సుందరియగు వనసుందరి ఉద్భవించెను. ఆ వనసుందరి అరణ్యములో మధువులో పెరుగుతున్నది. ఇప్పుడామె నవ యౌవనవతి. చంద్రుని సోదరి అయిన వనసుందరిని చింతామణాదులతో స్వీకరించి విష్ణుమూర్తికి యిష్టుడవై అనేక వేల సంవత్సరములు ఇహ లోకమునందు భోగములను అనుభవించి అంతమందు నీ తండ్రివలె నారాయణుని కింకరుడవు కాగలవు. ఈ ప్రదేశము 'నీలాద్రి' అనియు 'పురుషోత్తమ క్షేత్రమనియు' పేరుపొందును అని దీవించెను.

ఇట్లు బ్రహ్మదేవుని నుండి అనేక వరములను పొంది ఇహలోకమునందు అనేక భోగములను అనుభవించి అనంతరము వైకుంఠమును చేరెను.

**హనుమద్వ్రత కల్పములో మూడవ అధ్యాయము సమాప్తము.**

(శక్త్యానుసారము నివేదనము చేసి హారతి యివ్వవలెను)

## మంగళ హారతి

రామచంద్రాయ జనక - రాజజామనోహరాయ
మామకాభీష్టదాయ - మహిత మంగళం
॥రామచంద్రాయ॥

కోసలేశాయ మందహాస - దాసపోషణాయ
వాసవాది వినుత స - ద్వరద మంగళం
॥రామచంద్రాయ॥

విమల రూపాయ వివిధ - వేదాంత వేద్యాయ
సుజనచిత్త కామితాయ - సుభగమంగళం
॥రామచంద్రాయ॥

రామదాస మృదుల - హృదయ కమల నివాసాయ
స్వామి భద్రగిరి వరాయ - సర్వమంగళం
రామచంద్రాయ॥

* * *

## మంటప దానము, వాయన దానము

వ్రతము పూర్తి అయిన తరువాత వ్రతమును బ్రాహ్మణోత్తమునిచే నిర్వహింప చేసుకున్నవారు ఆయనకు

1. దక్షిణతాంబూలాదులతో పాటు
2. కలశమును మినహాయించి తెల్లని వస్త్రము, బియ్యము, తమలపాకులు, చెక్కలు, నాణెములు
3. నేతితో చేసిన 13 గోధుమ అప్పాలు వాయన దానము చేయవలెను.

స్వయముగా వ్రతము చేసుకున్నవారు వయోవృద్ధులైన పేదలకు మంటప దానము, పూజ్యులకు వాయన దానము యివ్వలెను.

* * *



## వ్రత విజ్ఞాపనము, ఉద్యాపనము

శ్లో॥ యత్రాస్తి భోగో నహితత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో నహి తతత్ర భోగః ।
శ్రీ మారుతే స్సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్త ఏవ ॥

॥శౌనక సంహిత॥

భావము : ఎచ్చట భోగముండునో అచ్చట మోక్షముండదు. ఎచ్చట మోక్షముండునో అచ్చట భోగముండదు. కాని ఆంజనేయ సేవాతత్పరులకు భోగము, మోక్షము రెండును సిద్ధించును.

తమ మనోరథములు సత్వరముగా తీర్చగలుగు శ్రీహనుమంతుని వ్రతము చేయ నిశ్చయించుకున్నవారు శుచి అయి సింధూరము నొసట దిద్దుకొని స్వామి చిత్రపటము వద్దగాని, ప్రతిమ వద్దగాని పుష్పమును ఉంచి ఎన్ని పర్యాయములు, ఏయే సమయములందు వ్రతము చేయ నిశ్చయించినారో స్వామికి నమస్కరిస్తూ తెలుపవలెను. ఆంజనేయస్వామి వ్రతములో 13వ అంకె ప్రత్యేకత గలదు కాబట్టి సంవత్సరమునకు ఒక పర్యాయము మార్గశిర శుద్ధ త్రయోదశినాడు చేస్తూ ఆవిధముగా 13 పర్యాయములు చేయవలెను. అంతకన్నా త్వరగా 13 పర్యాయములు చేయ నిశ్చయించినవారు వరుసగా 13 త్రయోదశలునాడు గాని లేక ప్రతీ మంగళ, శనివారములందుగాని చేయవచ్చును. ఈ వ్రతము 13 పర్యాయములు చేయలేనివారు 1, 3, 5, 7, 9, 11 పర్యాయములు చేయవచ్చును. హనుమంతుని పూజ ఏదినమైనా, ఏ తిథినాడైనా, ఏ నక్షత్రమునందైనా చేయవచ్చును.

ఎన్ని పర్యాయములు చేయ నిశ్చయించినారో స్వామికి తెలిపి మొదటిసారి చేసిన వెంటనే గాని మధ్యలో గాని అన్నీ పూర్తి అయిన తరువాత గాని వ్రత ఉద్యాపనము చేయవచ్చును. అనగా ఉదాహరణకు 5 పర్యాయములు చేయ నిశ్చయించినవారు మొదటి వ్రతము అయిన తరువాత గాని, మధ్యలో గాని, 5 పూర్తి అయిన తరువాత గాని ఉద్యాపనము చేయవచ్చును. మొదట గాని మధ్యలో గాని ఉద్యాపనము చేసినా నిశ్చయించుకున్న సంఖ్యను పూర్తి చేయవలెను. అనివార్య కారణముల వలన నిశ్చయించుకున్న వ్రతములు పూర్తిగా నిర్వహించలేని పరిస్థితులు సంభవించినప్పుడు తమ అపరాధమును మన్నించుమని కోరుతూ ఉద్యాపనము చేయవచ్చును. దోషము లేదు.

ఎన్ని పర్యాయములు వ్రతములు నిర్వహించినా ఉద్యాపనము చేయకపోతే వ్రతము పూర్తి అవనట్టే ! ఉద్యాపన చేయునప్పుడు కలశముతోపాటు మంటపము, స్వయంపాకము, దక్షిణ తాంబూలములు దానమియ్యవలెను. దానము తీసుకున్నవారిని హనుమ స్వరూపులుగా భావించవలెను. మంటపము, వాయనము యిచ్చిన తరువాతగాని, ఉద్యాపనము చేసిన తరువాత గాని పూజకు వచ్చిన వారితో కలిపి ఫలహారముగాని భోజనము గాని చేయవలెను.

* * *

## శ్రీ ఆంజనేయస్వామి వారి 13 అక్షరముల మంత్రము

శ్రీ హనుమద్వ్రతములో 13 అంకెకు ప్రాధాన్యము కలదు. ఆంజనేయస్వామి సీతమ్మను లంకలో మార్గశిర శుద్ధ త్రయోదశినాడు చూచినాడని, సీతమ్మ యీ దినమున ఎవరు నీ వ్రతమును చేయుదురో వారి అభీష్టములన్నీ నెరవేరునని వరమిచ్చెనని ప్రమాణము కలదు.



అందుచేత ఆంజనేయస్వామి వ్రతములో 13 ముడుల తోరమునకు పూజ చేసి కుడి చేతికి లేక మెడలో ధరించవలెనని నియమము గలదు. సంవత్సర నియమముతో13 సం॥లు వ్రతము ఆచరించవలెనని చెప్పబడియున్నది. అదే విధముగా 13 అక్షరములు గల శ్రీ ఆంజనేయస్వామి మూల మంత్రమును వ్రతములో భాగముగా పలుకవలెనని చెప్పబడినది. కనుక **'ఓం నమో భగవతే వాయునందనాయ'** అను మంత్రమును వ్రతములో చెప్పబడినప్పుడు నిస్సందేశముగా పలుక వచ్చును.

ఈ మంత్రమును పురశ్చర్య నియమముతో నిత్య జపము చేసిన వ్రతమును ఆచరించినవారికి సత్వరముగా ఫలితములు వచ్చును. ఆవిధముగా యీ మంత్రమును జపించవలెనన్న గురువు ద్వారా ఉపదేశమును తప్పనిసరిగా పొందవలెను. అహంకారము లేక నిత్యదేవతార్చన చేస్తూ యీ మంత్రమును గురువు ద్వారా ఉపదేశించబడి కనీసము 13 సంవత్సరములు శ్రీ ఆంజనేయ స్వామిని సేవించు వారి ద్వారా యీ మంత్రమును పొందవచ్చును. ఆవిధముగా ఉపదేశము పొందిన అదృష్టవంతులు యీ వ్రతములో అష్టోత్తర శతనామములు బదులుగా యీ మంత్రమునే 108 పర్యాయములు జపించవచ్చును.

* * *

## పంపా సరోవరము విశిష్టత

ఆంజనేయస్వామి గంధమాదన పర్వతము నందలి బంగారు అరటి తోటలనుండి తన వాహనమైన ఒంటెపై సర్వసమృద్ధిగల పవిత్రమైన పంపా సరోవర ప్రాంతములో విహారమునకై వానరకోటితో సహా వచ్చెను. బంగారు అరటి తోటలతో నిండిన తీరములో, నదీ జలములలో తిరుగాడు హంసలు, చక్రవాకములు మొదలగు పక్షులతో,

కనువిందు చేయు రామ చిలుకలతో, కమ్మగా కూయు కోయిలలతో పంపానది పరిసరములన్నీ రమణీయముగా ఉన్నాయి. సువాసనలతో గుబాళించే పూల మొక్కలే కాకుండా మధుర ఫలాలు అమితంగా ఉన్న వృక్షాలను చూసి సంతోషించి యీ పుణ్య పంపానదీ తీరములో కొన్నాళ్ళు ఉందామని నిశ్చయించి తన సేనతో విడిది చేశారు. పంచ సరోవరాలైన 1. బిందు సరోవరము 2. నారాయణ సరోవరము 3. పంపా సరోవరము 4. పుష్కర సరోవరము 5. మాన స సరోవరములలో ఒకటైన ఆ పుణ్యనదీ జలాల్లో ఆంజనేయ స్వామి కొన్నాళ్ళు స్నానపానాదులు చేయడంతో ఆ నదీ జలాలు పావనమయినాయి. ఆంజనేయ స్వామికి పుత్రికా సమానమైన పంపానదీ జలములలో స్నానం చేసి ఆ తీరములోనే శ్రీ హనుమద్వ్రతమును ఆచరించవలెను. వీలులేని పరిస్థితులలో పంపానదీ జలములను సేకరించి యీ వ్రతములో భాగమైన పంపానది పూజలో వినియోగించవలెను. అదీకూడ వీలు కాని పరిస్థితులలో నిత్యము వాడుతున్న జలములనే పంపానదిని ఆవహింపచేసి పూజించవలెను.

* * *

## ఆంజనేయ స్వామి వాహనం - ఒంటె

బంగారు కంబళితో అలంకరింపబడి, నవరత్నములతో ఒప్పు బంగారు చిరుగజ్జెలతో ప్రకాశించుటనట్టి, అందెల అవ్యక్త ధ్వనితో ఆహ్వానింపబడెడి అస్తరణము కలిగెడి, వేలాడుచూ కదులుతున్న అగ్రభాగము కలది

వాడియైన ముళ్ళను తినునది; పొడవగు మెడ, పెద్ద దేహము, ఎత్తగు పృష్ఠ భాగము, మంచి తోక గలది, చక్కని నాదమిచ్చుచు బంగారము, రత్నములు కల ఆభరణములు కలది



మేరు పర్వతము వలె ఎత్తైనది;
రోగము ముదిమి లేనిది;
పవిత్రమైనది;

పన్నెండేళ్ల వయస్సు కలిగి, మనసుతో సమానమైన వేగము కలది; విరిసిన పూవు వలె మెత్తనగు అన్ని అవయవములతో ప్రకాశించునది;

గందమాదన పర్వతము యొక్క నదినుండి అత్యద్భుతముగా పుట్టినది,

ఆదిశేషుని యొక్క పడగయందలి రత్నము వలె నున్నది,

కాంతి యొక్క మొత్తమా అన్నట్లున్న తన వాహనమగు ఒంటెను యెక్కి గందమాదన పర్వతమందలి బంగారు అరటి తోటల నుండి హనుమంతుడు మనోహరమగు పంపానదీ తీరమునకు వచ్చెను.

* * *

## హనుమ పూజా ఫలితము

శ్లో॥ తస్మిన్ సంపూజితే భానుర్బ్రహ్మ గౌరీ మహేశ్వరః ।
శ్రీ జానకీపతిస్సాక్షాత్ ఆదినారాయణః ప్రభుః ॥

ఈశశక్రాది దిక్పాలాః కుమారో గణనాయకః ।
బ్రహ్మర్షయో వసిష్ఠాద్యా సనకాద్యాశ్చ యోగినః ॥

పితరో వసవో రుద్రాః పూజితాః సుర్నసంశయః ।
హనూమంతం మహాత్మానం జయకామః ప్రపూజయేత్ ॥

తస్మాత్ సర్వప్రయత్నేన శ్రీరామ ప్రియకింకరమ్ ।

తా॥ ఈ ఆంజనేయ మూర్తిని పూజించిన యెడల సూర్యుడు, బ్రహ్మ, గౌరి, మహేశ్వరుడు, రాముడు, దిక్పాలకులు, కుమారస్వామి, గణపతి,

వసిష్ఠాది మహర్షులు, సనకాది సిద్ధియోగులు, పితృదేవతలు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, పూజింపబడినవారై ఇష్ట సిద్ధులను ఇచ్చుదురు. కావున ఆంజనేయుని ముఖ్యముగా పూజింపవలెను.

* * *

## స్వర్గీయ ఎం.ఎస్. రామారావు గారి
## తెలుగు హనుమాన్ చాలీసా

శ్లో॥ ఆపదామ పహర్తారం - దాతారం సర్వ సంపదాం !
లోకాభిరామం శ్రీరామం - భూయో భూయో నమామ్యహం!

శ్లో॥ హనుమాన్ అంజనాసూనుః - వాయు పుత్రో మహా బలః
రామేష్టః ఫల్గుణ సఖః - పింగాక్షో అమిత విక్రమః
ఉదధిక్రమణశ్చైవ - సీతాశోక వినాశకః
లక్షణ ప్రాణదాతాచ - దశగ్రీవస్య దర్పహా ॥

ద్వాదశైతాని నామాని - కపీంద్రస్య మహాత్మనః ।
స్వాపకాలే పఠేన్నిత్యం - యాత్రాకాలే విశేషతః ।
తస్య మృత్యుభయం నాస్తి - సర్వత్ర విజయీభవేత్ ॥

### శ్రీ హనుమాను గురుదేవు చరణములు
### ఇహపర సాధక శరణములు

బుద్ధిహీనతను కలిగిన తనువులు
బుద్బుదములనీ తెలుపు సత్యములు ॥ శ్రీహను ॥

1. జయ హనుమంత - జ్ఞానగుణ వందిత
జయ పండిత - త్రిలోక పూజిత !



2. రామదూత - అతులిత బలధామ !
అంజనీపుత్ర - పవనసుతనామ

3. ఉదయభానుని - మధుర ఫలమని
భావనలీల - అమృతమును గ్రోలిన !

4. కాంచనవర్ణ - విరాజిత వేష
కుండలామండిత - కుంచిత కేశ ॥శ్రీహనుమ॥

5. రామ సుగ్రీవుల - మైత్రిని గొలిపి
రాజ పదవి - సుగ్రీవున నిలిపి

6. జానకీపతి - ముద్రిక దోడ్కొని
జలధి లంఘించి - లంక జేరుకొని !

7. సూక్ష్మ రూపమున - సీతను జూచి
వికట రూపమున - లంకను గాల్చి !

8. భీమ రూపమున - అసురుల జంపిన
రామ కార్యమును - సఫలము జేసిన ॥శ్రీహనుమ॥

9. సీత జాడగని - వచ్చిన నిను గని
శ్రీ రఘువీరుడు - కౌగిట నినుగొని !

10. సహస్రరీతుల - నిను గొనియాడగ !
కాగల కార్యము - నీపై నిడగ !

11. వానర సేనతో - వారధి దాటి
లంకేశునితో - తలపడి పోరి

12. హోరు హోరున - పోరు సాగిన
అసుర సేనల - వరుసగ గూల్చిన ॥ శ్రీ హను ॥

13. లక్ష్మణ మూర్ఛతో - రాముడడలగ
సంజీవి తెచ్చిన - ప్రాణ ప్రదాత

14. రామ లక్ష్మణుల - అస్త్రధాటికి
అసురవీరులు - అస్తమించిరి !

15. తిరుగులేని - శ్రీ రామ బాణము
జరిపించెను - రావణ సంహారము !

16. ఎదిరిలేని - ఆ లంకాపురమున
ఏలికగా - విభీషణు జేసిన ॥ శ్రీ హను ॥

17. సీతారాములు - నగవుల గనిరి
ముల్లోకాల - హారతులందిరి !

18. అంతులేని - ఆనందాశ్రువులే
అయోధ్యాపురి - పొంగి పొరలే

19. సీతారాముల - సుందర మందిరం
శ్రీకాంతుపదం - నీ హృదయం !

20. రామచరిత - కర్ణామృత గాన
రామనామ - రసామృత పాన ॥ శ్రీ హను ॥

21. దుర్గమమగు - ఏ కార్యమైన
సుగమమే యగు - నీ కృప జాలిన !

22. కలుగు సుఖములు - నిను శరణన్న
తొలగు భయములు - నీ రక్షణ యున్న !

23. రామ ద్వారపు - కాపరివైన నీ
కట్టడిమీర - బ్రహ్మాదుల తరమా !



24. భూత పిశాచ - శాఖినీ ఢాకినీ
భయపడి పారు - నీ నామ జపము విని ॥ శ్రీ హను ॥

25. ధ్వజా విరాజా - వజ్ర శరీరా
భుజబల తేజా - గదా ధరా !

26. ఈశ్వరాంశ - సంభూత పవిత్ర !
కేసరి పుత్ర - పావన గాత్ర !

27. సనకాదులు - బ్రహ్మాది దేవతలు
శారద నారద - ఆదిశేషులు !

28. యమ కుబేర - దిక్పాలురు కవులు
పులకితులైరి - నీ కీర్తి గానముల ॥ శ్రీ హను ॥

29. సోదర భరత - సమానా యని
శ్రీరాముడు - ఎన్నికగొన్న హనుమా !

30. సాధులపాలిట - ఇంద్రుడ వన్నా !
అసురుల పాలిట - కాలుడ వన్నా !

31. అష్ట సిద్ధి - నవనిధులను దాతగ
జానకీమాత - దీవించెనుగ !

32. రామ రసామృత - పానము జేసిన
మృత్యుంజయుడవై - వెలసిన ॥ శ్రీ హను ॥

33. నీ నామ భజన - శ్రీరామ రంజన !
జన్మ జన్మాంతర - దుఃఖ భంజన !

34. ఎచ్చటుండిన - రఘువర దాసు
చివరకు రాముని - చేరుట తెలుసు !

35. ఇతర చింతనలు - మనసున మోతలు
స్థిరముగ రాముని - సేవలు సుఖములు !

36. ఎందెందున - శ్రీరామ కీర్తన
అందందున - హనుమాను నర్తన ॥ శ్రీ హను ॥

37. శ్రద్ధగ దీనిని - ఆలకింపుమా
శుభమగు ఫలములు - కలుగు సుమా !

38. భక్తి మీరగ - గానము సేయగ
ముక్తి కలుగు - గౌరీశులు సాక్షిగ !

39. తులసిదాస - హనుమాను చాలీసా
తెలుగున సులువుగ - నలుగురు పాడగ

40. పాడిన నాలో - దోషములున్నా
ఓ హనుమన్నా ! - మన్నింపు మన్నా ॥ శ్రీ హను ॥

మంగళహారతి - గొను హనుమంతా
సీతారామ - లక్ష్మణ సమేత !
నా అంతరాత్మ - నిలుమో అనంతా !
నీవే అంతా - శ్రీహనుమంతా !

(**1978** నుండి యీ హనుమాన్ చాలీసాను యీ సాధకుడు యెక్కడ గానం చేసినా యెంతోమంది యీ పాటను అడుగుతున్నారు. సుందరదాసు M.S.రామరావుగారికి నివాళులు అర్పిస్తూ వారి అభిమానుల కోరికపై అందిస్తున్నాము).



# సాధకుని మాట

'తననే నమ్మిన వారిని స్వామి తనే నడిపిస్తారు'. ఈమాట యీ సాధకుని విషయములో అక్షరాలా నిజం ! సాధకుడు అనేవాడు భగవంతుని పైనే ఆధారపడాలి తప్ప తన స్వశక్తిపై నమ్మకము పెట్టుకోకూడదు. ఈ సాధకుడు తన 32 సంవత్సరముల ఆధ్యాత్మిక ప్రస్థానములో ఊహాతీతమైనవి,మానవాతీతమైనవి నిర్వహించగలగడానికి కారణం భగవత్ విషయములు తెలుసుకుందామని చేసిన నిరంతర కృషియే ! అసాధ్య సాధక స్వామి యీ సాధకుడికి సాధనకు మించినవి యిచ్చినారు.

పూజ కాని వ్రతము కాని సంకీర్తన గాని చేసేటప్పుడు మనకు భగవంతుని సాన్నిహిత్యము యేర్పడాలి, ప్రత్యక్షముగా భగవంతుడు మన సేవలను అందుకోవాలి అంటే మనం చేస్తున్నదేమిటో ముందు మనకు తెలియాలి. చేసేటప్పుడు భక్తి, శ్రద్ధ, భావనతో చేస్తే భగవదనుభూతితో పాటు భగవదనుగ్రహము కలుగుతుంది.

ఈ చిన్ని పుస్తకము పదిమందికి ఉపయోగపడుతుందనే నమ్మకముతో గురుదేవులు శ్రీ ఆంజనేయస్వామి దయతో ముద్రించడము జరుగుతున్నది. ఈ ప్రయత్నములో జరిగిన తప్పులు అన్నీ యీ సాధకుడివే !

శ్రీరామ దాసానుదాసుడు
**కొమ్మూరు ఉమాప్రసాద్ భాగవతార్**

శ్లో॥ ఆంజనేయ పూజితశ్చేత్ - పూజితా స్సర్వదేవతాః ।
హనుమన్మహిమా శక్యో - బ్రహ్మణాపిన వర్ణితుమ్ ॥

తా॥ ఆంజనేయ స్వామిని పూజిస్తే సమస్త దేవతలను పూజించినట్లే. బ్రహ్మ దేవుడు కూడ వర్ణింప జాలని మహిమ హనుమన్మహిమ.

(పరాశర సంహిత)

## బాహ్యముగా, అంతరముగా శుద్ధి

(మనలో శారీరకముగా, మానసికముగా ఉన్న అపవిత్రతలను పోగొట్టే మహత్తు కలిగిన పుండరీకాక్షుని నామమును మూడు పర్యాయములు పలుకుచూ జలమును శిరస్సుపై మూడు సార్లు జల్లుకొని పవిత్రులము అవుచున్నట్లు సంకల్పించుకోవలెను.)

**పుండరీకాక్ష ! పుండరీకాక్ష ! పుండరీకాక్షాయ నమః !**

***

## ఘంటారావము



(ఘంట వాయిస్తూ యీ క్రింది విధముగా పలుకుచూ దేవతలు వచ్చునట్లును, దుష్టశక్తులు పోవునట్లును సంకల్పించవలెను.)

**ఓ దేవతలారా ! ఇప్పుడు నిర్వహించబడుచున్న దైవకార్యమునకు మీరు వచ్చి సహకరించుటకు లాంఛనముగా ఆహ్వానముగా ఘంట వాయించుచున్నాను. తరలి రండి !**

**దైవకార్యమునకు ఆటంకము కలిగించే శక్తులు ఏవయినా ఉన్నచో వెంటనే వెళ్ళిపోవును.**

***



## తైల దీపములు

(ఒక్కొక్క దీపమునకు 2 వత్తులు కలిపి ఒక వత్తిగా చేసి రెండు దీపములు వెలిగించి ఒక దీపము తూర్పుముఖముగను, రెండవ దీపము



ఉత్తర ముఖముగను (మంటపమునకు రెండు ప్రక్కలా) ఉంచవలెను. అనంతరము దీపకాంతులు నిండిన ఆ ప్రదేశములో దేవతల దివ్యతేజస్సు వచ్చి చేరినట్లు సంకల్పించుచూ ప్రశాంతమైన మనస్సుతో నమస్కరించవలెను.)

## ఉదక పూజ

(ఆచమనము చేయబోయే ముందు ఆ జలమును ప్రార్థించినచో మంచి ఫలితములు కలుగును. కావున ఆచమన (పంచ) పాత్రలో జలము వేసి తులసి దళము, పుష్పము పెట్టి కుడిచేతి ఉంగరము వ్రేలు జలమునందు ఉంచుతూ ...)

**ఓ జలములారా! మీరు ఆనందమునకు, అనంత శక్తికి పుట్టినిల్లు కనుక మాకు సంతోషమును, బలమును కలిగించవలెనని ప్రార్థించుచున్నాను.**

## ఆచమనముతో గోవిందనామములు

(మొదటి మూడు నామములతో ఆచమనము చేస్తూ మగవారు 'స్వాహా!' అనియు ఆడవారు 'నమః' అనియు పలుకవలెను.)

1. కేశవాయ స్వాహా
2. నారాయణాయ స్వాహా
3. మాధవాయ స్వాహా
4. గోవిందాయ నమః
5. విష్ణవే నమః
6. మధుసూదనాయ నమః
7. త్రివిక్రమాయ నమః
8. వామనాయ నమః
9. శ్రీధరాయ నమః
10. హృషీకేశాయ నమః
11. పద్మనాభాయ నమః
12. దామోదరాయ నమః
13. సంకర్షణాయ నమః
14. వాసుదేవాయ నమః
15. ప్రద్యుమ్నాయ నమః
16. అనిరుద్ధాయ నమః